# కేసరిగిరి క్షేత్ర మహిమ



కేసరిగిరి రామలింగేశ్వర మహాలింగస్థానము

రచయిత

శ్రీ ఎం. సత్యనారాయణ

# కేసరిగిరి క్షేత్ర మహిమ

రచయిత

శ్రీ ఎం. సత్యనారాయణ

ఈ గ్రంథము
తిరుమల తిరుపతి దేవస్థానం వారు
ధార్మిక గ్రంథ ప్రచురణకై రచయితుల కిచ్చు
ఆర్థిక సహాయముతో ముద్రితము
1995

శేషగిరి క్షేత్ర మహిమ

ప్రథమ ముద్రణ : భావ సం. శివరాత్రి (27-2-1995)

ప్రతులు : వేయి

రచన :

**శ్రీ ఎం. సత్యనారాయణ**
**7-16,** వాసవీ నగర్**,**
ముత్యాలరెడ్డిపల్లి**, S.V.** యూనివర్సిటీ **P.O.**
**తిరుపతి.**

**మూల్యము : రూ. 10/-**

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
**1-1-517/బి/1,** న్యూ బాకారం**,**
గాంధీనగర్**,** హైదరాబాద్-**500 380.**
ఫోన్లు **: 611413, 600547.**

# ముందుమాట

1982 అక్టోబరు నుండి 1988 జూన్ నెల వరకు తిరుమల తిరుపతి దేవస్థానంవారి తరపున శ్రీ వేంకటేశ్వర వేద సంస్కృత పాఠశాలలో అధ్యాపకునిగా పనిచేసి కేసరిగిరి శ్రీ భవాని రామలింగేశ్వర స్వామి, తిరుమల శ్రీనివాస భగవానుని దయ వలన తిరుపతికి బదిలీ అయ్యాను.

1985 వ సంవత్సరములో కీసరగుట్ట వేద సంస్కృత పాఠశాలలో పని చేయుచున్నప్పుడు రామలింగపల్లి శంకరశాస్త్రి గారి స్ఫూర్తితో, మార్గదర్శకత్వంలో కేసరిగిరి క్షేత్ర మహిమను సంస్కృత పండితులు కె. సుబ్రహ్మణ్యంగారి సహాయకత్వంతో ఈ పొత్తమును రచింపగలిగితిమి. గురుతుల్యులైన శంకరశాస్త్రి గారి తరపున భవానీ రామలింగేశ్వరస్వామి పాదపద్మములకు ఈ పుస్తకమును సమర్పించుచున్నాము.

పుస్తకము ప్రారంభించినప్పటినుండి ఇప్పటివరకు అన్ని విధాలా సహాయసహకారాలు అందిస్తూ అన్ని రంగములలో తోడ్పడిన కె. సుబ్రమణ్యం, శ్రీవేంకటేశ్వర వేద సంస్కృత పాఠశాల సంస్కృత అధ్యాపకుల వారి తరపున, మా తరపున మా కులదైవమైన, మాకు చాల ప్రీతిపాత్రుడైన శ్రీనివాసుని తరపున ఈ గ్రంథాన్ని పూర్తి హక్కులతో భవానీ రామలింగేశ్వరస్వామి వారికి సమర్పిస్తున్నాము.

1990 వ సంవత్సరములో తిరుపతి S.V. ఓరియంటల్ కాలేజీ లెక్చరర్ సముద్రాల లక్ష్మణయ్యగారు ఇందులోని తప్పులను సరిచేసి ఇచ్చినారు. వారికి సర్వదా మేము కృతజ్ఞులము.

తిరుమల తిరుపతి దేవస్థానం S V.V.V.S. కాలేజీ హైద్రాబాదు లెక్చరర్ C.V. శేషాచార్యులు గారి సహాయసహకారాలతో ఈ గ్రంథం ఈనాటికి ముద్రించబడుచున్నది. తక్కువ వ్యవధిలో ఈ గ్రంథాన్ని మనకు అందిస్తున్న వారికి మనమందరము కృతజ్ఞులము.

ఈ పుస్తకమును అమ్మిన పైకముతో వచ్చు వడ్డీతో బాలాజీ ప్రసాదము అను పేరుతో ఆదివారము ప్రసాదము ఇవ్వబడును. శివ రాత్రికి ముందుగా వున్న బ్యాంకు పైకములో 50 శాతము పుస్తకము పునర్ముద్రణకు ఇవ్వబడును. తరువాత పుస్తకములపై వచ్చు ఆదాయము కూడా ఆ ఖాతాకే జమ చేయబడును.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థికసహాయంతో ఈ పుస్తకము ముద్రించబడుచున్నది. పుస్తకముపై వచ్చు ఆదాయము బాలాజీ ప్రసాదము అను పేరుతో భవానీరామలింగేశ్వరస్వామి దేవాలయములో భక్తులకు పంపిణీ చేయబడును.

ఇట్లు

ఇ, సత్యనారాయణ

# పీఠిక (అవతారిక)

కేసరిగిరి మునిజన తపోయోగ్య క్షేత్రము. ప్రస్తుతము ఈ క్షేత్రము కేసరగుట్ట యని పిలువబడుచున్నది ఇందు వెలసిన దైవము రామలింగేశ్వరుడు. ఇతని సతి భవాని యను నామమున గిరిపై వెలసియున్నది. శ్రీ కేసరిగిరి రామలింగేశ్వరుని మహిమను భక్త్యభినివేశమున కవి వివరించిన విధానము నొకింత పరిశీలింతుదము.

పూర్వము దేవసేవి యను యోగి శిష్యుల గూడి పుణ్యతీర్థయాత్ర చేయుచు ఈశ్వరవాస మగు కేసరిగిరి కేతెదెంచెను. అచ్చట శంకరు మది సేవించి విశ్రమించియున్నతఱి దేవసేవి శిష్యుడు రామశరణుడు కేసరిగిరిక్షేత్ర మహిమ దెల్పు మని కోరెను అతడు తన శిష్యునికి ఈ క్షేత్రమహత్త్వమును వివరించెను

శ్రీరామచంద్రుడు రావణసంహారానంతరము అయోధ్య జేరి పట్టాభిషిక్తుడై రాజ్య మేలుచున్న సమయమున ఒక బ్రాహ్మణుడు మృతుడైన తన కుమారుని శ్రీరాముని యొద్దకు గొనివచ్చి ఇట్లనెను: "ఓ రామచంద్రా! నా కుమారుని అకాలమరణమునకు నీవే కారణము. పుత్రశోకమున నేనును, నా భార్యయును మరణించినచో నీకు బ్రహ్మహత్యాపాతక మగును'' అనుచు వాపోవదొడగెను అపుడు శ్రీరామునిచెంతనేయున్న నారదమహర్షి "రామా! ఈ త్రేతాయుగంబున బ్రాహ్మణేతరులకు తపస్సు చేయు నర్హత లేదు. అయినను శంబూకుడు అను వృషలుడు సశరీరస్వర్గార్థియై ఘోరతపమాచరించుచున్నాడు. అతని తపము ధర్మవిరుద్ధము కావున నీవు శంబూకుని తలద్రుంచి బ్రాహ్మణ బాలకుని బ్రతికింపుము'' అని పల్కినాడు. అంతట శ్రీరాముడు పుష్పకవిమానారూఢుడై శంబూకునియొద్ద కేతెంచి అతని శిరమును ఖండింపగా అయోధ్యలో మృతుడై యుండిన బ్రాహ్మణబాలకుడు సజీవుడైనాడట. తపస్విని చంపినందులకు దుఃఖించుచు శ్రీరాముడు సమీపమున నున్న అగస్త్యాశ్రమమును జేరి తాపసుని సంహరించిన పాతకము తొలగు విధము ననుగ్రహింపు మని,

మునిని వేడుకొన్నాడు అగస్త్యముని శ్రీరామునకు అతిలోకపావనము, దివ్యము, మహర్షిగణసేవితము, సర్వసిద్ధిప్రదము, మోక్షదాయకము, తపోయోగ్యము, సర్వపాప నివారణదక్షము పుణ్యప్రదనగు కేసరిగిరి మహత్త్వమును వివరించెను. కేసరిగిరి కేగి శివలింగప్రతిష్ఠ గావించి శివుని ఆరాధించినచో నీ వొనర్చిన శంబూకవధకృత పాతకము తొలగును అని పల్కెను

కేసరిగిరి గరుడగంధర్వ కిన్నర కింపురుష సిద్ధజనసేవితము. తత్త్వజ్ఞాన వికారములచేత దేవఋషుల (దేవర్షుల) చేత వేదవేదాంగ పారంగతులగు బ్రహ్మర్షుల చేత రాజర్షిప్రవరులచేత నిత్యసంసేవితమై యోజనవిస్తారము, అంతే యౌన్నత్యమును గల్గి విరాజిల్లుచుండెను. తొలుత ఆ పర్వతమున మహర్షులు పార్వతీపరమేశ్వరుల సన్నిధానమును గోరి ఘోరతప మాచరించిరి. హరుడు, నందీశ్వర, భృంగీశ్వరాది ప్రమథగణములు, అష్టదిక్పాలకులు, సకలదేవగణములు, తుంబురునారదాదులు స్తోత్రగానములు చేయుచుండగా పార్వతీసహితుడై ఆనందతాండవమును చేయుచు, కేసరిగిరియందు తప మాచరించుచున్న మహర్షుల ప్రార్థన మాలకించి, ఆర్తత్రాణపరాయణుడై కాళ్ళగజ్జెలు ఘల్లుఘల్లుమనుచుండగా గంతులు వేయుచు, ఢమఢమ డమరుక నాదవినోదము గావించుచు వారికి ప్రత్యక్షమయ్యెను వారందరూ సాష్టాంగదండప్రణామము లాచరించి వినుతించిరి. అంత "ఓ మునులారా! మీ కోర్కె లేవి? అతిదుర్ఘటంబైనను నెఱవేర్తు"నని పరమేశ్వరుడు పల్కగా వారు, "దేవా! మా ప్రార్థనలను మన్నించి మాకు సాక్షాత్కరించిన ఈ నటరాజరూపమున నటరాజేశ్వరుడవై సపరివారముగ ఈ పర్వతమున స్థిరనివాసివై, భక్తాభీష్టవరప్రదుడవై సదా వెలసియుండవలయు"నని ప్రార్థించిరి. ఈ పర్వతమున నిష్ఠాగరిష్ఠులై నన్ను ధ్యానించువారలకు వరప్రదుడనై మీ కోర్కె మన్నించి సదా నెలకొనియుండెదను.ఈ పర్వతము నాకు నివాసయోగ్యమై, పుణ్యప్రదమై వెలయుచుండును" అని ఋషుల ననుగ్రహించెను. కావున శ్రీరామా! నీవు ఆ పర్వతమున కేగి శుభ ముహూర్తమున లింగప్రతిష్ఠ చేసి శివు నర్చించినచో శంబూకవధాపాతకము తొలగు నని అగస్త్యమహర్షి పల్కెను.

అగస్త్యవచనానుసారము శ్రీరాముడు హనుమంతునితో గూడి ఆ పర్వతమును చేరెను. 'సాయంసమయ మగులోపల కాశినుండి శివలింగమును గొని

రమ్మ'ని హనుమంతునితో పలెక్కను శ్రీరాము నాజ్ఞ ననుసరించి హనుమంతుడు కాశీ జేరి అందు గంగాతీరమున తగు శివలింగమును త్వరగా గుర్తింపజాలక నూటొక్క శివలింగములను గొనివచ్చెను. ఇంతలో శుభముహూర్తము అతిక్రమించుచుండగా శ్రీరాముడు పరమేశ్వరుని ప్రార్థించెను శివుడు శ్రీరామునకు స్వయంభూలింగము ననుగ్రహించెను; శుభముహూర్తమున శ్రీరాముడు స్వయంభూలింగమును ప్రతిష్ఠించి పూజావిధు లాచరించుచుండెను శుభముహూర్త మతిక్రమింపగా హనుమంతుడు నూటొక్కలింగములను తెచ్చెను.

ఇంతలో శ్రీరాముడు స్వయంభూలింగమును ప్రతిష్ఠించుటచూచి హనుమ ఖిన్నుడయెన్యు. 'కాలాతిక్రమణదోషములేకుండ విశ్వేశ్వరప్రసాదితమగుస్వయంభూలింగమును ప్రతిష్ఠించితిని. గావున నీవు దెచ్చిన శివలింగములను ఈ పర్వతమున ఉచితస్థానమున నుంచి రమ్ము' అని శ్రీరాముడు హనుమంతునితో ననెను. హనుమంతుడు దీనవదనుడై తన ప్రయాస వృధా యయ్యెనని బాధపడుచు ఆ లింగముగను అచ్చటచ్చట పడవైచెను హనుమంతుని విచారమును గుర్తించి శ్రీరాముడు "ఈ క్షేత్రము నీ పేరుతో కీసరక్షేత్రముగా వెలయుగాక! ఈ పర్వతము కీసరగిరి యనబడును గాక!" అని ఓదార్చెను హనుమంతుడు వానరములతో కొన్నాళ్ళు ఆ పర్వతముపై విహరించుచు హనుమదీశ్వరలింగమును ప్రతిష్ఠించెను. శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడిన స్వయంభూలింగము శ్రీరామలింగేశ్వరలింగము. శ్రీరామలింగేశ్వరుడు ఈ కేసరిగిరిపై భక్తాభీష్టవరప్రదాయకుడై వెలసియున్నాడు." అని ఇంకను ఆ పర్వతమునందలి ప్రకృతి రామణీయకత్వము, వివిధతీర్థములు, వాని మహిమలు, పరిసర దైవసన్నిధానములు మున్నగువానిని గూర్చి దేవసేవి తన శిష్యున కెఱిగించెను.

## కేసరి గిరియందలి దర్శనీయములగు తీర్థములు, పవిత్ర స్థలములు :

దేవసేని తన శిష్యుడగు రామశరణునకు దెల్పిన విధాన మిది: కేసరిగిరి యందు పశ్చిమాభిముఖముగా వెలసియున్నది రామలింగేశ్వరాలయము. ఇదియే స్వయంభూలింగము శ్రీరామునిచే ప్రతిష్ఠితము. ఈ లింగమునకు సహస్రఘటములతో అభిషేకము చేసినను నీరు బయటకు ప్రవహింపక ఇంకిపోవును. ఇది దేవరహస్యము. ఈ పర్వతగుహలనుండి శ్రీ నటరాజేశ్వరుని కాళ్ళగజ్జెల రవళి,

ఢమరుకనాదము భక్తులకు వినబడునని ప్రతీతి శ్రీరామలింగేశ్వర లింగమునకు వామభాగమున పరాశక్తి యగు పార్వతీదేవి వెలసియున్నది దేవాలయమునకు ప్రక్కన స్వామి పుష్కరిణి కలదు ఇందు స్నాన మాచరించిన వారికి సకల పాపములు తొలగును ఈ స్వామి పుష్కరిణి చెంతగల వృక్షముక్రింద తూర్పు భాగమున నున్న శిలాఫలకముపై కూర్చున్నచో భక్తివైరాగ్యములు, జ్ఞానోదయ మగును. ఇటనుంచి ఈశాన్యదిక్కున గల బిలాంతరములు దుర్గము లందు పూర్వము మహర్షులు తప మాచరించెడివారట. వీనికి కొంతదూర మున పెద్దశిల చెంత హనుమంతునిచే ప్రతిష్ఠింపబడిన మహిషాసురమర్దనీ విగ్రహ మున్నది. హనుమంతుడు సీతాదేవిని ప్రార్థించి ఆమె అనుమతితో మహిషాసురమర్దనిని ప్రతిష్ఠించినాడట.

దీనికి సమీపమున వ్యాఘ్రబిల మున్నది ఇచ్చట హనుమంతునిచే ప్రతిష్ఠింపబడిన హనుమదీశ్వరలింగము కలదు. ఇచ్చట పూర్వము బెబ్బులులు నివసించేవట దీనికి కొంతదూరమున సీతాసరోవరము మునిజనావసరముల కనువగువనముకలదు.ఇందలి కందమూలఫలాదులుమునులకాహారయోగ్యములు. ఇచ్చట గల కమలాకరసరోవరము శివరాత్రి పర్వదినములందు ఈ గిరి కేతెంచు అశేషభక్తజనావళికి స్నానపానార్థమై యుండును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర నామములతో వెలసిన మూడు కుండములు దేవతలచే నిర్మితములై పవిత్రజల సమృద్ధములై యున్నవి.ఈ మూడు కుండములకు నైరుతిదిశయందలి కోననుండి కొంత పైభాగమునకు గుహామార్గ మున్నది. ఇది సామాన్యమానవులకు ప్రవేశింప రానిది. ఆత్మశక్తి, దేవతానుగ్రహము లేనివారు ఈ గుహామార్గమున పోవ జాలరు ఈ మార్గమధ్యమున ధూర్వాకారము గల తెల్ల, శ్వేత, రక్త, కృష్ణ సర్పము లుండునట. పర్వతపైభాగమున హనుమంతుని దర్శనము చేసికొన వచ్చును. హనుమంతునిచే క్రమము దప్పనట్లు విసిరివేయబడిన ఏకోత్తరశత లింగములు అచ్చట కాననగును. శ్రీరామలింగేశ్వరాలయ సమీపమున గల సన్న్యాసుల మఠముచెంత కాశి బుగ్గ (పాలపుంత) అను జలధార గలదు. సంతానార్థులు, దీర్ఘవ్యాధి పీడితులు ఈ నీటిని త్రాగి, మండలపర్యంతము దీక్షతో స్నాన మాచరించిన వారి కోర్కెలు నెరవేరునట.

## ఆలయ నిర్మాణము :

కొన్నివందల యేండ్లకు పూర్వము రెడ్డి కులమునకు చెందిన గోన రాజులు పరమేశ్వర భక్తియుతులై, సత్య, ధర్మ పరాయణులై శ్రీ కేసరిగిరి క్షేత్రప్రాంతమును పాలించుచుండిరి. శత్రురాజుల బారినుండి తురుష్కులనుండి తమను రక్షించుకొను నుద్దేశ్యముతో ఈ కొండపై నివాస ముండిరి శ్రీ రామ లింగేశ్వరానుగ్రహమున శత్రువులను జయించి స్వామివారికి దేవాలయ గోపుర ప్రాకారములు నిర్మించిరి తాము నివసించియుండిన ప్రదేశమున నొక లింగ ప్రతిష్ఠ చేసిరి. దీనికి సమీపమున పద్మసరోవరము కలదు. సరోవరము చెంత గోన రాజుల సభాస్థలంబులు కలవు. తత్సమీపమున ననేక గుహలు పూర్వము పులులకు, నక్కలకు నివాసమై యుండెనట. రామలింగేశ్వరాలయమునకు నైరుతిదిశగా నున్న శిలా స్తంభమున మత్స్య, కూర్మ, వరాహ, ఆంజనేయ, వినాయకుల మూర్తులు కలవు. స్తంభము పై లింగము, నందీశ్వరుడు కనబడును. గోన రాజులు శైవ - వైష్ణవ అభేదమును తెల్పునట్లు ఈ స్తంభమును నిర్మించారని తెలియుచున్నవి.

## కేసరిగిరి నామసార్థక్యము :

దేవసేవి మహర్షి శిష్యులతో ఈ కొండపై కొంతకాల ముండెను. "స్వామీ! ఈ క్షేత్రము సాధుపుంగవుల కావాసమై భక్తాభీష్టప్రదమగు పుణ్యనిలయమై దివ్యోత్సవవిరాజితమై యుండునట్టి పరమేశ్వరక్షేత్రమై యుండునట్లు తాము ప్రయత్నింపవలయు"నని శిష్యులు దేవసేవిని వేడిరి. ఆ యోగివరుడు శిష్యులతో "మీ కోర్కె పరమేశ్వరేచ్ఛానుసారమై యున్నది. మన మందఱము జపతపో ధ్యానానుష్ఠానములతో, నియమనిష్ఠాగరిష్ఠులమైయుండి పరమేశ్వరుని పూజింతము. మనము కోరినట్లు పరమేశ్వరు డనుగ్రహింపగలడు" అని పల్కి అట్లే ఆచరించు చున్నంత నొకనాడు రామలింగేశ్వరస్వామి దేవసేవి మహర్షి కలలో కనబడి "మీ కోర్కె ఇక కొన్ని వందల ఏండ్లకు నెఱవేరగలదు. ఇది సత్యము. నెమ్మనమున నుండుడు ఈ క్షేత్రమున స్వయంభూలింగముగా నేను శ్రీ రామలింగేశ్వరుడను నామమున ప్రసిద్ధి నొందెదను. శ్రీరాముడు ఈ పర్వతముపై హనుమంతుని 'కేసరి' యని సంబోధించ అతని పేరుతో ఈ క్షేత్రము వెలయు నని అనుగ్రహించి యుండుటచే ఇది "కేసరిగిరి"యని పిలువబడును.

నే నిచ్చట భవానీసహితుడనై వెలసి భక్తవరప్రదుడవై నిత్యము నెలకొని యుండెదను. కాశీక్షేత్రమున కన్న మిన్నయై ద్వాదశజ్యోతిర్లింగములకంటె నధికప్రభావము కలదై భక్తముక్తి ప్రదమై సర్వజనహృద్యమై సంసేవ్యమై అలరారుచుండును" అని దేవసేవి మహర్షి తన శిష్యులకు తన స్వప్నవృత్తాంతమును తెలిపెను.

శ్లో. ఏతత్ కేసరి శ్రీరామలింగేశ్వర కథానకమ్,
యే శృణ్వంతి నరాస్తే వై సర్వాన్కామాన్సమాప్నుయుః.

కేసరిక్షేత్ర శ్రీ రామలింగేశ్వరుని మాహాత్మ్యకథను చదివినవారికి, వినిన వారికి శ్రీరామలింగేశ్వరానుగ్రహమున సకలకోర్కెలు సిద్ధించు ననునది ఫలశ్రుతి.

## శివరాత్రిమహిమ :

గీ. అష్టమియు సోమవారంబు నసితపక్ష
మందలి చతుర్దశియు శివహర్షకరము
లందు శివరాత్రి యున్నతంబై యలరుట
నా వ్రతం బెల్లరకు ముఖ్యమై తనర్చు.

శివుని అరాధించుటకు శుభతిథులు పది. అవి నాల్గు సోమవారములు. రెండు అష్టములు, రెండు ఏకాదశులు, రెండు చతుర్దశులు. అందును మాఘ బహుళ చతుర్దశి మిక్కిలి శ్రేష్ఠము. ఇది శివరాత్రి పర్వదినము. కేసరిగిరియందు శివరాత్రి యుత్సవము మిక్కిలి భక్తివిశేషముతో, వైభవోపేతముగా నిర్వహింప బడుచుండునట. శివరాత్రి పూజావిధానము ఈ గ్రంథమున చక్కగా విపులీకరింపపడినది. శివరాత్రి మహిమ తెలియక ఆచరించినను మిక్కిలి ఫల మబ్బు ననుటకు గురుద్రహుడు అను బోయవాని కథ మిక్కిలి హృద్యము భక్తిభావ సమన్వితముగా నున్నది.

గురుద్రహుడు అజ్ఞానవశమున అప్రయత్నముగ నైనను చేసిన శివరాత్రి ఉపవాసమునకు, జాగరణమునకు, తాను అధిరోహించియుండిన బిల్వవృక్షము నందలి అకులు ఆ చెట్టుక్రింద నున్న శివలింగముపై పడి అర్చనాభావమును

పొందినందులకు, అభిషేకప్రియుడగు శివునకు బిల్వవృక్షమునందలి ఆకుల నుండి మంచుబిందువులు పడి అభిషేకింపబడినందులకు శివుడు సంతసించి ఆతని నన్నుగ్రహించినాడట. "ఇకనుండి నీవు గుహుడు అను పేరుతో బోయలకు ప్రభువై యుండుము. కొంత కాలమునకు శ్రీమహావిష్ణువు శ్రీరామావతారుడై నీకు దర్శన మీయగలడు. అప్పుడు నీవు ఆతనిని సేవింపగలవు. పిమ్మట నీకు సాయుజ్య మిత్తును" అని శివుడు గుహుదహుని అనుగ్రహించినాడట ఈ కథ శివరాత్రిమాహాత్మ్యమును వెల్లడిచేయు పూర్వగాథయై ప్రశస్తిని తెచ్చినది. కావున శివరాత్రినాడు తెలియక శివుని ఆర్చించినను అనంతఫల మబ్బును.

## కేసరిగిరియందలి చారిత్రకమగు హైందవసంస్కృతి:

కేసరిగిరి పుణ్యక్షేత్రమే గాక శత్రుదుర్భేద్యమైన యొక కోటగా నుండి నట్లు చారిత్రక ఆధారములు తెల్పినాడు కవి. క్రీ.శ. 4 వ శతాబ్దమునుండి 6 వ శతాబ్దమువరకు పాలించిన విష్ణుకుండినులు ఈ క్షేత్రమున రాజ్యమును స్థాపించి కోటను నిర్మింపజేసినారట. వీరిలో మాధవవర్మ యను నతడు పెక్కు క్రతువు లొనర్చి, విశాలసామ్రాజ్యాధిపత్యమును వహించియుండెను. ఇందులకు నిదర్శనముగా ఇక్కడి పురావస్తుశాఖవారి త్రవ్వకాలలో చతురస్రాకార యజ్ఞవాటిక బయల్పడినది. క్రీ.శ. 1199 సం॥ నుండి క్రీ.శ. 1261 సం॥ వరకు కాకతీయులు ఓరుగల్లును రాజధానిగా చేసుకొని పాలించినారు. క్రీ.శ. 1261 సం॥ ప్రాంతమున తెలంగాణప్రాంతమును గోనరాజులు పాలించుచుండిరి. ఆ కాలమున కాకతీయసామ్రాజ్యము క్షీణదశలోయుండెను. ఢిల్లీపాలకుడగు అల్లాఉద్దీన్ ఖిల్జీ కాకతీయ హోయసల యాదవ రాజ్యములను తన ఏలుబడిలోనికి తెచ్చుకొనియుండెను.

కాకతీయుల బలహీనత నాధార మొనర్చుకొని గోనవంశీయులగు రెడ్డి రాజులు తెలంగాణమును కేసరగిరిని రాజధానిగా చేసుకొని పాలించుచుండిరి. అల్లాఉద్దీన్ ఖిల్జీ గోనరాజులతో యుద్ధమొనర్చినట్లు చరిత్ర తెల్పుచున్నది. క్రీ.శ. 1325-1351 వరకు ఢిల్లీని పాలించిన మహమ్మద్ బిన్ తుగ్లక్ రెడ్డి రాజులతో యుద్ధము చేసినట్లు తెలియుచున్నది. కాలక్రమమున తెలంగాణము

నవాబుల పాలనకు లోబడినది. బహమనీరాజుల సుబేదారు కులీకుతుబ్షా తెలంగాణమును తన యేలుబడిలోనికి తెచ్చుకొని గోల్కొండను రాజధానిగా చేసికొని పాలించెను గోల్కొండను పాలించిన అబుల్ హసన్ తానీషాయొద్ద మంత్రులుగా నుండిన అక్కన్న, మాదన్నలు కేసరగిరిపై నృసింహస్వామిమూర్తిని ప్రతిష్ఠింపబూని అందలి మౌలాలి గుట్టపై విగ్రహమును నిర్మింపజేసి ప్రతిష్ఠింపబోవు సమయమున ఢిల్లీ సుల్తాను ఔరంగజేబు తన మతస్థులచే భంగపరచినాడట. కావున ప్రతిష్ఠింపబడని నృసింహస్వామి విగ్రహము ఇప్పటికిని అచ్చట చూడనగును. మరియు ఆళ్వారుల విగ్రహములు, కూర్మావతార విగ్రహములు, బహు సుందరమై యున్న ఆ యాలయము ప్రకాశరహితమై యున్నది. జైన దేవాలయ అవశేషములును ఇచ్చట కాననగును.

## ఆధునికచరిత్ర :

క్రీ. శ. 1930 సం.న అశ్వయుజ మాసశుద్ధ పాడ్యమినాడు రంగారెడ్డి జిల్లాలోని మేడ్చల్ తాలూకా యందలి రాంపల్లి గ్రామనివాసి యగు గొంగులూరి గుండయ్యశాస్త్రిగారి మనుమడు శ్రీ శంకరశాస్త్రిగారు మరియు, కీసర గ్రామనివాసి తాటాకం శ్రీ రామలింగయ్యగారు కీసరగిరిపై శ్రీ రామలింగేశ్వర స్వామిని దర్శించిరి. అక్కడనే నివాసమేర్పరచుకొని తపోధ్యాననిష్ఠాగరిష్ఠులై యుండిరి. ఆ సమయమున వారు పొందిన అనుభూతులు, చూచిన వింతలు, విశేషములు ఈ గ్రంథమున చక్కగా పొందుపరచబడి యున్నవి. శ్రీ భవాని రామలింగేశ్వరస్వామికి వంశపారంపర్య పూజారులుగా నున్న వారి వంశవృక్షమును కవి తెల్పియున్నాడు వీరిలో తటాకం రామలింగయ్య కీసరక్షేత్రమున శ్రీరామలింగాలయ పురోభివృద్ధికి మిక్కిలి శ్రమించిరట. వంశపారంపర్య ధర్మకర్తల మండలి అధ్యక్షులుగా శ్రీ ఈశ్వరయ్య కొనసాగుచున్నారు. 17, 18, 19 శతాబ్దులలో నామమాత్రంగా నుండిన కీసరగిరి క్షేత్రము నభివృద్ధి పరచినవారు శ్రీ సింగిరెడ్డి వెంకట్రామరెడ్డిగారు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి మఱ్ఱి చెన్నారెడ్డిగారు, మేడ్చల్ పంచాయతీ సమితి అధ్యక్షులుగా నుండిన

శ్రీ కామిడి వీరారెడ్డిగారు, ఈ రెడ్డిత్రయముచే కీసర క్షేత్రము పురోగతి నొందిన విధము వారి భక్తిశ్రద్ధలను చాటుచున్నది. అతిథి గృహములు, ఆర్. టి. సి. బస్‌స్టాండు, వేదపాఠశాల వీరి కృషిఫలితమును ఇచట వెలసినవి. ధర్మకర్తల మండలి ఏర్పాటై నిత్యోత్సవములు, విశేషోత్సవములు నిర్వహింపబడుచున్నవి.

జి. సుబ్రహ్మణ్యం M.A.
సాహిత్య ఆచార్య
టి. టి. డి. వేదపాఠశాల
కీసరగుట్ట.

ఓం నమశ్శివాయ

# శ్రీ రామలింగాష్టక స్తోత్రమ్

1. శుద్ధజ్ఞానప్రదో నిత్య ఐహికాఽముష్మికార్థదః,
భవానీసహితో దేవో రామలింగోఽభిరక్షతు.

2. రామలింగప్రభుం వందే జగత్కారణకారణం,
త్రిపురాసురహంతారాం భక్తకల్పమహీరుహమ్.

3. హే రామలింగ! హే నాథ తాపత్రయనివారక!
కామక్రోధాదిసంతప్తం రక్ష మాం భవసాగరాత్.

4. ప్రతిష్ఠితో హి యో దేవ స్సీతారామేణ ధీమతా,
కేసరాద్రౌ విజయతే భవానీసహిత శ్శివః.

5. మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే,
శుద్ధస్ఫటికవర్ణాయ రామలింగాయ తే నమః.

6 ప్రతిష్ఠితోఽసి రామేణ అర్చితోఽసి సురైరపి,
తథైవ ద్విజవర్యై శ్చ పూజితోఽసి సదా ప్రభో.

7. హృత్పుండరీకమధ్యస్థో భూతానాం చ హితే రతః,
నిత్యముక్తో జగత్సాక్షీ పాలయత్వనిశం మృడః.

8. భస్మానులిప్తసర్వాంగ కరుణాకర శంకర,
స్వీకురుష్వ స్తుతి మిమాం భక్త్యా ప్రథమతోఽర్పితామ్.

## ఫలశ్రుతి

శ్లో. రామలింగాష్టకస్తోత్రం యః పఠే ద్భక్తిమా న్నరః,
స సర్వపాపనిర్ముక్తో దుర్లభాం గతి మాప్నుయాత్.

ఇత్థం భగవత్పాదరేణుః
**మూర్తి వేంకట్రామశర్మా**
స్మార్తాధ్యాపకః
శ్రీ వేంకటేశ్వర వేద సంస్కృత పాఠశాలా
కీసరగుట్ట

భావ మాఘ బహుళ చతుర్దశీ (మహాశివరాత్రి)

శ్రీ కేసరిగిరి రామలింగేశ్వరాయ నమః

# కేసరిగిరి క్షేత్ర మహిమ

శ్రీమదఖండ మహీమండల మండనాయమానంబయిన భరతఖండంబునందు సకలభోగభాగ్యంబులకు ఆలవాలమై విలసిల్లు ఆంధ్రప్రదేశ రాజధానియగు భాగ్యనగరంబునకు ఈశాన్యదిక్కున కాభరణమై అలరారు శ్రీ కేసరిగిరియందు అధివసించిన శ్రీరామలింగేశ్వరస్వామి మాహాత్మ్యము నభివర్ణించు తలంపున ఇష్టదేవతానుస్మరణ గావించి శ్రీగురుదేవతానుగ్రహప్రాప్త వాగ్వైచిత్ర్యముగల మహాజనులచే వినిన దానిని స్వానుభవసంపాదిత కించిత్ జ్ఞానమున యథామతి వివరింపగోరి ప్రారంభించెద

శ్లో. దేవసేవీ మహాయోగీ విరాగీ విశ్వసంమతః,
కదాచి త్పర్యటన్నాగాత్ కేసరీనామ భూధరమ్.

పూర్వము ఒకప్పుడు దేవసేవి యను మహాయోగి వీతరాగియై శిష్యులతో గూడి పుణ్యక్షేత్రదర్శనాభిలాషచే పర్యటన జేయుచు ఈశ్వరావాసమై యోగిజనసేవ్యంబగు కేసరగిరికి అరుదెంచెను. అచ్చట ఈశ్వరుని నిత్యనివాసంబగు రామలింగేశ్వరాలయమును జూచి స్వామిపుష్కరిణిలో స్నానమాడి శుచియై శిష్యులు వెంటరాగా ఆలయంబు ప్రవేశించి శ్రీ స్వామివారిని కన్నులపండువుగా దర్శించి నమక, చమకవిధానమున మహారుద్రాభిషేకము గావించి భక్తి కలిగినవాడై -

శ్లో. తత్ర దృష్ట్వా రామలింగేశ్వరాలయ మతంద్రితః,
కృత్వా స్నానం శుచిర్భూత్వా స్వామిపుష్కరిణీజలే.

శ్లో. హర శంభో మహాదేవ పతితం భవసాగరే,
మా ముద్ధర జగద్వంద్య త్రాహి [illegible] శరణాగతమ్.

అని ఈ తీరున అనేకవిధముల ప్రస్తుతించి సాష్టాంగదండప్రణామంబు లర్పించి తన్మయుడై లక్ష్యానుసంధానపూర్వక ధ్యాన మవలంబించి తరువాత మాధ్యాహ్నిక కాలకృత్యములు పూర్తి గావించి శిష్యసమేతుడై తత్త్వవిచారము చేయుచుండ ప్రసంగవశంబున పావనతీర్థక్షేత్ర దేవతామాహాత్మ్యాదులను తర్కించుచుండ ఇదియే మంచిసమయం బని తలంచి రామశరణ యను శిష్యుడు ముందుకు వచ్చి సాష్టాంగదండప్రణామంబు లాచరించి వినయవిధేయతలు కలిగి గురుభక్తిప్రభావ ముట్టిపడ - 'ఓ గురుదేవా! నా మనస్సున ఒక సంశయము కలదు. తమ యానతిమేర అనుమతించిన సంశయవిచ్ఛేదము గావించుకొందు' నన్న గురుదేవుడు సమ్మతించి' 'వత్సా! నీ మనోగతసంశయము ఎట్టిదో నాకు చెప్పు'మనగా -

'ఓ గురుదేవా! ఈ పుణ్యస్థలక్షేత్ర మాహాత్మ్యంబు ఎట్టిది? యిందు నిత్య నివాసము జేయుచున్న ఈశ్వరుని ప్రభావంబు ఏలాంటిది? ఈ పవిత్ర రామ లింగేశ్వర అధిష్ఠత ఎట్లు కలిగె? ఏ పుణ్యాత్మునిచే ప్రతిష్ఠింపబడి ఈ అలయ విధాన మెట్లు జరిగె? జ్ఞాన వైరాగ్యసాధనల కనుకూల వాతావరణ మెట్లు సమ కూరె? ఇది యది యననేల. ఇందలి విశేషంబులు ఆమూలముగా పరికించి చూచిన విన కుతూహలంబుగా నున్నది. భవదీయ వాగమృత విశేషమున మదీయ జన్మ సఫలంబు జేసుకొనియెద నని విన్నవించుకొనగా గురుదేవుండు "వత్సా! నీ వడిగిన ప్రశ్న లన్నియు అతినిగూఢమై రహస్యాతిరహస్యమై, పూర్వులచే గోపనీయమై మదీయ విద్యాజ్ఞానమునకు అతీతమై యున్నవి. అయినను శ్రీగురు దేవతారాధనచే లభించిన జ్ఞానలేశంబున యథాశక్తి వివరింప సమకట్టెద" నని దేవతాధ్యాన నిమీలిత నేత్రుండై సమాధిస్థితి నొందినవాడై ధ్యానదృష్టి నవలం బించి, విషయగ్రహణానందితాంతరంగుండై యిట్లని చెప్ప నారంభించె. ప్రియశిష్యా! నిలకడ గల మనస్సు కలవాడవై యాకర్ణింపుము.

శ్లో. పవిత్రాతిపవిత్రం చ శృణ్వతాం పాపనాశనమ్,
పుణ్యం యశస్కరం పుంసాం భోగమోక్షసుఖావహమ్.

పవిత్రాతిపవిత్రంబును, సర్వపాపనాశనంబును, కీర్తిదాయకంబును భుక్తిముక్తిసుఖప్రదంబును, అతిపురాతనంబును అతిరహస్యంబును అగు

యీ సచ్చరిత్రంబు అతిగోపనీయమైనను నీయందలి వాత్సల్యంబున లోకోపకార బుద్ధిచే తోచిన కొలది నిష్టదేవతాంకితంబు జేసి వివరించెద—

శ్లో. అస్తి త్రేతాయుగేఽయోధ్యానగరీ భువి విశ్రుతా,
తస్యాం వసతి ధర్మాత్మా భాస్కరాన్వయసంభవః.

## సంక్షిప్తరామాయణ కథ

పూర్వము త్రేతాయుగంబున **సూర్యవంశస్థుడైన** అయోధ్యాపతి యగు దశరథునకు కౌసల్య, **సుమిత్ర**, కైకేయి అను ముగ్గురు భార్యలయందును వంశోద్ధారకులగు సుతులు లేనందున కులగురువగు వసిష్ఠానుమతితో పుత్రకామేష్టి జేయ, వారికి శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్ను లను వారు కలిగిరి. అందు రామలక్ష్మణులు యాగరక్షణార్థము విశ్వామిత్రుని వెంట వెళ్ళి అస్త్రము లందబడసి యజ్ఞరక్షణానంతరము మునివెంట మిథిల ప్రవేశించి జనకమహారాజుచే సత్కరింపబడి శివధనుర్భంగము గావించినంత జనకుడు సీతావివాహవిషయమై దశరథమహారాజును రప్పించి శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు నలువురికి సీత, ఊర్మిల, మాండవి శ్రుతికీర్తి యను నలువురు కన్నెలను సాలంకృత కన్యాదాన పురస్సరముగ వివాహవిధి జరిపించి వారలను పంపించె. ఇట్లు కొంత కాలము సుఖంబుగా నుండునంత దశరథమహారాజు సకలసద్గుణశ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు అయిన శ్రీరామునకు యౌవరాజ్యపట్టాభిషేకము జేయు తలంపున ముహూర్తము నిశ్చయము గావింప కైకదాసి మంథర విని విఘ్నము ఆపాదింప నెంచి కైకకు తెలుప, రెండు వరంబులు - ఒకటి పదునాలుగు సంవత్సరములు దండకారణ్యవాసంబు శ్రీరామునకును, యిక రెండవది భరతపట్టాభిషేకము చేయ కైక మహారాజును వరము లర్థించి, రాముని సీతాలక్ష్మణ సహితునిగా అరణ్యమునకు పంపుటయు, శ్రీరాముడు పత్నీసోదరసమేతుడై దండకాటవియందు తిరుగుచు మహర్షుల దర్శించి పంచవటి జేరి పర్ణశాల నివాసము జేయు తరి శూర్పణఖాముఖవికారకరణానంతరము రావణుడు మారీచునితో కూడి పర్ణశాలకుం జని మారీచుడు మాయామృగవేషధారియై, సీతను ప్రలోభింప సీతా మనోరథపూర్తికై రాముడు విల్లమ్ములు గైకొని వెంట పరుగెత్తునంత ఆ రక్కసి అతిదూరము పోయి రామశరాహతమై-'హా సీతా! హా లక్ష్మణా' యనుచు అసువులు బాసె. ఆ ఆర్తనాదము విని సీతామహాదేవి నాథునకు ఆపద సంభ

వించినదని విశ్వసించి లక్ష్మణుని పంపెను. అత డేగునంత రావణుడు మాయా కల్పితసన్యాసివేషధారియై పర్ణశాలాప్రాంగణమున విచారాక్రాంతయగు సీతను చూచి మోహవివశుడై నిజాకారంబు నొంది రామా! రామా! యని ఆక్రందించు జానకిని గొని లంకానగర నిజనివాసప్రాంత అశోకవాటిక నుంచె.

శ్రీరాముడు పంచవటి జేరి ప్రాణసఖి గానక పరితపించి లక్ష్మణుడు వెంట రాగా అరణ్యములందు తిరుగుచూ విరహాతురుండై, శబరిచే సపర్యల నంది ఆ ప్రాంతమంతయు కలయజూచె. తత్పరిసర ఋష్యమూక పర్వతనివాసి యగు సుగ్రీవుడు రాముని చూచి వాలిప్రతినిధి యని భయము నొంది హనుమంతుని కనుగొని రమ్మని పంప అతడు సన్యాసి రూపధారియై రాముని సన్నిధి చేరి భక్తితో నమస్కరించి అడిగి వృత్తాంతము తెలుసుకొని నిజాకారం బున రామలక్ష్మణులను భుజంబుల నెక్కించుకొని వెళ్ళి అగ్నిసాక్షికంబుగా సుగ్రీవరామసఖ్యంబు గావించునంత శ్రీరాముడు సుగ్రీవవిరోధి యగు వాలిని చంపి, కిష్కింధారాజ్య పట్టాభిషేకంబు సుగ్రీవునికి జరిపించి తాను మాల్యవంత మను పర్వతముపై వర్షపు రాత్రములు గడిపి సుగ్రీవాదేశప్రకారము సీతాన్వేష ణార్థము వానరులను నలుదిక్కులకు పంప, అందు ఆంజనేయులు శ్రీరామ నామాంకిత అంగుళీయకము గైకొని కతిపయవానరసమేతుండై సముద్రతీరము జేరి జటాయువు సోదరు డగు సంపాతి వచనానుసారము శతయోజనవిస్తీర్ణము గల సముద్రమును దాటి, లంకాపురప్రవేశము గావించి, అంగుళపు భూమిని కూడా వదలక కలయజూచి, వెదకి వెదకి వేసారి కడసారి ప్రయత్నమున రావణుని అంతఃపురమునకు పోయి కానక ధ్యానంబు జేసి అశోకవృక్షచ్ఛాయావేదికపై ప్రాణత్యాగోన్ముఖురాలగు జనకజను గని, వంగి భక్తితో నమస్కరించి, కుశలం బడిగి, రామనామాంకితము గావించిన అంగుళీయకమును ఇచ్చి, తిరిగి సీతామహా దేవి చూడామణి నీయ తీసుకొని, పోయివచ్చెద నని సెలవు గైకొని, అచ్చటి నుండి వెడలి, లంకాదహనంబు జేసి దిరిగి సముద్రము లంఘించి జాంబవదాదు లతో శ్రీరాముని జేరి, సీతాదర్శనవార్త నివేదించినంత, శ్రీరాముడు కపిసైన్యము వెంటరాగా సముద్రము జేరి రామేశ్వరమున లింగము ప్రతిష్ఠించి, వారిధి బంధించి సర్వసైన్యసహితుడై దాటి, లంకలో నున్న సువేల యను పర్వతముపై విడిది గావించి, క్రమప్రకారము సర్వరాక్షససంహారము సలిపి రావణ, కుంభకర్ణాదు లను దునుమాడి మృతుల కందఱకును విభీషణునిచే పరలోకక్రియలు చేయించి,

అతనిని లంకకు అధిపతిని జేసి అగ్నిచే పవిత్ర మొనర్చిన సీతను గ్రైకొని పుష్పకవిమానారూఢుండై వానరులు మున్నగువారు వెంట రాగా భరద్వాజాశ్రమమును జేరి మహర్షి యొసగిన యాతిథ్యమును స్వీకరించి వారి యాజ్ఞలను శిరసా ధరించి నందిగ్రామంబున జటావల్కలధారి భరతుని గాంచి కౌగలించి, హర్షించి సుమంత్ర వశిష్ఠాదులు వెంట రాగా అయోధ్య ప్రవేశించి రాజసింహాసనము నధిష్ఠించి పట్టాభిషిక్తుడై, నిష్కంటకముగా రాజ్యపరిపాలన జేయుచుండ, ఒకనాడు జనపదనివాసి యగు వృద్ధబ్రాహ్మణుడు మృతబాలకుని గొని రామరాజ్య సభాస్థలంబున కేతెంచి పుత్రశవమును ముందుంచుకొని—

శ్లో. కిన్ను మై దుష్కృతం కర్మ పురా దేహాంతరే కృతమ్,
యదహం పుత్ర బాలం త్వాం పశ్యామి నిధనం గతమ్.

'హా కుమారా! నేను ఏ పాపము జేసితిని. పూర్వజన్మ దుష్కృత పరిపాకమున నీ విట్లు బాల్యముననే నిధనము నందితివి.' అని వగచి, ఈ అకాల మరణమునకు రాజు కారకుడు గావున ఓ శ్రీరామా, యిది పరిశీలించుము. లేనిచో-

శ్లో. రాజద్వారి మరిష్యామి పత్న్యా సార్థ మనాథవత్,
బ్రహ్మహత్యాం గతో రామ! సముపేత్య సుఖీ భవ.

నేనును నా భార్యయు ఏక కాలంబున అనాథలమై అసువులు బాసెదము. ఈ బ్రహ్మహత్యాపాపంబు నీకుం జెందు సుఖివై యుండుము ' అని ఇట్లు అనేక విధముల వాపోవుచుండ శ్రీరాముడు త్రికాలజ్ఞానసంపన్నులగు వసిష్ఠాది మహర్షులను వినయముతో ప్రశ్నింప - అంత నారదుడు శ్రీరామా, ఇయ్యది త్రేతా యుగంబు. బ్రాహ్మణేతరులకు తపస్సు చేయు అర్హత లేదు. అట్టితరి ఇప్పుడు—

శ్లో. *శమ్బూకో నామ వృషలః పృథివ్యాం తప్యతే తపః,
శీర్షచ్ఛేద్య స్స తే రామ తం హత్వా జీవయ ద్విజమ్.

శంబూకు డను వృషలుడు పృథివియందు తపస్సు జేయుచున్నాడు. అతడు తపస్సు చేయుట కర్హత లేనివాడు. సశరీరస్వర్గార్థియై

* ఉత్తరరామ చరితము, భవభూతి.

అఖండతపము సలుపుచున్నవాడు. ఇయ్యది ధర్మవిరుద్ధము, (వృషలః=వృషం లాతీతి వృషలః=ధర్మము చెఱచువాడని సాభిప్రాయము) రామా, రాజువగు నీచే వాని తల త్రెంపబడవలసియున్నది వానిని చంపి బ్రాహ్మణబాలుని బ్రతికింపుము. నిష్ఠాగరిష్ఠుడు, సచ్చరిత్ర గలవాడగు బ్రాహ్మణ బాలుని బ్రతికించుట నీ రాజ ధర్మము అనిన—

రాముడు కుబేరవాహనమైన పుష్పకవిమానమును మనసా స్మరించునంత ఆ విమానము ఆకాశమార్గమున వచ్చుటయు, శ్రీరాముడు లక్ష్మణునకు మృత విప్రబాలకశవమును రక్షించు కార్యమును అప్పగించి తానును శరములను ధరించి విమాన మధిరోహించి ప్రాక్, పశ్చిమ, ఉత్తర దిక్కులంతయు వెదకి దక్షిణదిశ అరణ్యమంతయు వెదకుచున్నంత, ఒక్కచోట సరోవరతీరంబున వటవృక్షపు అధోభాగమున ఊర్ధ్వపాదుండై తాపసులు చేయు రీతిన కఠోర మైన తపస్సు చేయుచున్న వానినిం జూచి సంశయాత్ముండై-

"ఓ తపస్వీ! నీవు ఎవ్వడవు? దేనిని గూర్చి ఈ కఠోరతపస్సు చేయు చుంటివి" అనిన అతండు "ఓ ప్రభూ! నేను నిమ్నకులస్థుడను. శంబూకు డనువాడను. సశరీర స్వర్గసుఖానుభవ వాంఛచే, తప మాచరించుచుంటి" నన, రాముడు వాని శిరమును కత్తిరించె అంత అయోధ్యలోని బ్రాహ్మణబాలుడు సజీవి యయ్యె. అటు తరువాత రాముడు పుష్పకవిమానము నెక్కి తపస్విని చంపుటచే పశ్చాత్తాపము కలవాడై, వేగముగ అగస్త్యమహర్షి ఆశ్రమము జేరి, మహర్షిని దర్శించి నమస్కరించి, వినయము కలవాడై నిలుచుండ ఆ బ్రహ్మర్షి కుశలం బడిగి మనోగతంబు తెలుసుకొని, 'రామా! త్రికాలవేదులగు మాకు తెలియనిదంటూ ఉండదు అట్టితరి నీవు చేసిన తప్పులను నేను ఎరిం గితిని లోకకంటకుడగు రావణుని దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థమై లోకోపకార బుద్ధితో సంహరించినట్లు, ధర్మసంస్థాపనార్థమై రాజనీతికి బద్ధుడవై ఇపుడు శంబూకు డనువానిని సంహరించితివి అయినను ఇదియు హత్యాపావము కలిగించు నను తలంపు నీకు కల్గుట యుక్తము' అనిన శ్రీరాముడు వినమ్రుడై 'మహాత్మా! ఈ మహాహత్యాపాపంబులకు పరిహారము ఎటుల కల్గును? అపాయము తొలుగు ఉపాయమును తెలుపుడు. మీ యొక్క కృపావిశేషంబున ధన్యుడ నౌదు'నని పలువిధములుగా విన్నవించునంత అగస్త్యమహర్షి - కుమారా!

శ్లో. లోకైకపావనం దివ్యం మహర్షిగణ సేవితమ్,
సిద్ధిదం మోక్షదం నృణాం తపోయోగ్య మఘాపహమ్.

అతిలోకపావనంబును, దివ్యమును, మహర్షిగణసేవితంబును, సర్వ సిద్ధి ప్రదంబును మోక్షదాయకంబును, తపోయోగ్యంబును, సర్వపాపనివారణ దక్షంబును అగు ఒక పర్వత ముండు పుణ్యభూమియై యుండు. నీవు అందు చేరి ఈశ్వరుని ఆరాధించుము. ఎందుకనగా "దేవానాం చ హరః శ్రేష్ఠః" సమస్త దేవతలలో హరుడు శ్రేష్ఠుడు.

శ్లో. లీయతే గమ్యతే యత్ర యేన సృష్టి శ్చరాచరా,
తదేవ లింగ మిత్యుక్తం లింగతత్త్వపరాయణైః.

కం. విరివగు నీ సకలచరా
చరభువనము లెందు డిందు, సర్వం బట్లే
మరల నెట బొడము జగముల
కిర వెయ్యది లింగమది మునీంద్రవతంసుల్.

సమస్తమైన ఈ చరాచరము దేని నుండి పుట్టుచున్నదో దేనియందు లయ మగుచున్నదో అదే లింగము కావున స్వనామాంకితలింగమును ప్రతిష్ఠించి సుఖివి గమ్మన.-'రాముడు' మహర్షీ! తాము సెలవిచ్చిన ఆ పర్వతపుణ్యభూమికి అంత శ్రేష్ఠత్వంబు ఎట్లు కలిగె? విస్తారఔన్నత్యంబు లెంత? ఏ మార్గమున అచ్చటకు జేరుట శక్యంబు? నాయందు వాత్సల్యబుద్ధితో సర్వమును సవిస్తార ముగా జెప్పుడు అనిన ఋషిపుంగవుండు- 'ఓ రామా! పూర్వము గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధులచే సేవితంబును, తత్వజ్ఞాన విశారదులగు వేద వేదాంగ పారంగతులు నగు బ్రహ్మర్షులచే, దేవర్షులచే, రాజర్షులచే, ఎల్లప్పుడు అధివసించ బడినదియు యోజన పరిమిత విస్తారమును, అంతే యౌన్నత్యంబును కలిగి విరాజిల్లు పర్వత ప్రదేశము కలదు. ఆ ప్రాంతవాసులగు మహర్షులు అందరు ఒకచోట గుమిగూడి సదా పార్వతీపరమేశ్వరుల సన్నిధానంబు కోరి స్థిరచిత్తులై ఏకాగ్రమనస్సు కలవారై అందరూ ఏకకంఠంబున—

శ్లో. శివ శంకర విశ్వాత్మన్ శూలపాణేఽభయంకర,
చంద్రమౌళేఽద్రిభూనాథ దర్శనం దేహి నః ప్రభో.

శివ! శంకర! విశ్వాత్మన్! విశ్వేశ్వర! శూలపాణే! అభయదాతా! చంద్రమౌళీ! పార్వతీపతే! ప్రభో! దేవదేవా! మాకు ప్రత్యక్షదర్శనంబు కలుగజేసి కాపాడవే యని మొరపెట్టునంత రజతాద్రివాసి హరుండు నందీశ్వర భృంగీశ్వరాది ప్రమథగణములతో పరివేష్టితుండై బ్రహ్మాది సత్యలోకనివాసులు, ఇంద్రాదిస్వర్గలోకనివాసులు, అష్టదిక్పాలకులు, సమస్తదేవతాగణంబులు, తుంబురునారదాది దేవర్షుల సమూహాయముతో వేరువేరుగా స్తోత్రములు చేయుచున్నంత నిలుదుకోలువై యుండి తాను ఆనందము అతిశయించి తాండవంబు జేయుచుండి భూలోకవాసుల ప్రార్థన దీనాలాపంబులు చెవి తాకునంతనే దిగ్భ్రాంతుడై ఎట్లున్నవారు అట్లేయుండగా, శ్రీ నటరాజు ఆర్తత్రాణ పరాయణతచే గంతులు వేయుచూ కాళ్ళకు గజ్జెలు ఘల్లు ఘల్లు మనుచు ఢమరుకము ఢమ ఢమ శబ్దము చేయుచున్నంత పరుగెత్తుచుండ, కమలాసనాది దేవతలు పార్వతీ, వాణీ, శచీ మొదలగు దేవేరులు, కుమారగణములు ప్రమథగణంబులు, సపరివారంబుగా వెను వెంట రాగా ఆ ఆదిదేవుడు ససంభ్రమమున భూలోకపర్వతముపై ముని సమూహముల ఎదుట ప్రత్యక్షంబై నిలిచినంత - ఆ ఋషిసమూహము ఒక్కుమ్మడిగా సాష్టాంగదండప్రణామంబులు చేసి పులకితశరీరులై గద్గదకంఠులై భక్తిచే వినతులై ఇట్లని స్తుతించిరి -

శ్లో॥ జయ కైలాసనిలయ! జయ మృత్యుంజయ! ప్రభో!
జయ భక్తజనాధార! పాహి నశ్శరణాగతాన్.

శ్లో॥ జయ విశ్వేశ విశ్వాత్మన్ జయ వ్యాఘ్రాంజినాంబర,
జయ యోగిగణారాధ్య! పాహి పాహి నమో஽స్తు తే.

కైలాసనిలయా! విశ్వేశ్వరా! యోగిగణారాధ్యా! రక్షింపుము. రక్షింపుము. ఇవే మా నమోవాకంబులు. అని పలు విధములస్తుతించి సాగిలబడి లేవకున్నంత పరమశివుండు అత్యాదరమున మునులను లేవనెత్తి వేర్వేరుగ ఆలింగనము జేసుకొని, 'వత్సలారా! మీ కోర్కెలు ఏవి? అతిదుర్ఘటితంబైనను పూర్తి గావింతును' అనునపుడు ఋషిపుంగవుడు - దేవా! నీవు సర్వాంతర్యామివి. నీవు ఎరుంగనిది ఏమియు లేదు. వాఙ్మనగోచరుడవు. సృష్టి, స్థితి, లయకారకుడవు. అతీత అనాగత వేదివి. యోగిధ్యేయుండవు. మా ప్రార్థనలను ఆలకించి

యే రూపముతో మా ముందు గోచరమైతివో అదే ఆకారంబున ఈ పర్వతమున సపరివారంబుగా స్థిరనివాసము చేయుట మా ఎల్లరి కోరిక'' యని విన్నవింప పరమేశ్వరుండు - ఓ ఋషిపుంగవులారా! మీ వాంఛితములు అనన్యసామాన్యములు. ఈ ఆకృతి మానవుల కందరానిది అయినను ఈ పర్వతగర్భమున నున్న గుహా ప్రదేశములందు నిండు మనస్సుతో అవిచ్ఛిన్నముగా నిరంతర ధ్యానతపోనిష్ఠులగు మీ వంటి వారలకు గోచరమగు నేను నటరాజేశ్వరు డను పేరుతో సపరివారంబుగా నుండెదను. అదియును గాక ఈ పర్వతము పైభాగము లందు ఈ స్థలముపై భక్తితో నన్ను స్మరించు జనులందరకు నా తాండవ ధ్వనులు, తాళములు, మృదంగముల ధ్వనులు, జయజయధ్వనులు మునిజనులచే నిరంతర, ప్రణవనాదము ప్రతిరోజు సూర్యాస్తమయమున వినబడును. మునుల సంచారములు గోచరించును. మీయందలి కృపావిశేషముచే ఇంతవరకు చేయవలసివచ్చినది' అని నటరాజు మునులను అనుగ్రహించి అదృశ్యుడయ్యెను.

వత్సా! రామా! వింటివి కదా ఈ క్షేత్ర మాహాత్మ్యంబు. అనగా శ్రీరాముడు అగస్త్యమహర్షితో మీ సువాక్యాల మాధుర్యముచే ధన్యజీవి నైతిని. నా అంతరాత్మ కొంత విశ్రాంతిని పొందినది తరువాత జరుగబోవు కార్యక్రమమును ఆనతీయవే అనిన అగస్త్యుండు - రామరాజా! శుభకార్యమునకు ఆలస్యము చేయుతగదు. లింగప్రతిష్ఠానుకూల శుభముహూర్తము పంచదశఘటికాయుక్తమై తగియున్నది. అతిత్వరగా ఆ కార్యక్రమముతో నిమగ్నుడవు కమ్ము. అనిన నమస్కరించి శుభాశీస్సులను పొంది పోయెదనని సెలవు తీసుకొని రాముడు విమాన మెక్కి మనోవేగమున పర్వతముం జేరి తమ ప్రియతమభక్తుడైన ఆంజనేయస్వామిని మనసా స్మరించగా అంతలోనే ఆకాశమార్గమున దిగి వచ్చి వినమ్రుడై పాదములచెంత నమస్కరించి నిలుచున్న వాయుపుత్రుని శ్రీరాముడు గాఢాలింగనము జేసుకొని క్షేమముల నడిగి జరిగిన వృత్తాంతమంతయు వినిపించి 'వత్సా! ఈశ్వరప్రతిష్ఠానుకూలమైన స్థలము ఎచ్చట కలదో మన మిరువురము వెదకుదము. నీ సాయము ఇప్పుడు నాకు అత్యంతముఖ్యము. సూర్యుడు పశ్చిమదిశను జేరుచున్నాడు. సాయంకాల సంధ్యావందనాది కాలకృత్యంబులు ముగించుకొని అటుపై తరువాత కార్యమునకు వెళ్ళుదము' అని కాలకృత్యములు ముగించుకొని వాయునందనుడు వెంట రాగా స్థలాన్వేషణ గావించుచూ పరిసర శిలాప్రదేశంబులను వెదకుచుండ.

అంత ఒకచోట నానావిధవాద్య డిండిమ, డమరు, ఢక్కా, మృదంగ భేరీ, వీణా, వేణు, కరతాలాది శబ్దములు చెవికి వినబడునంత నిశ్చేష్టుడై చెవుల కింపుగా విని, తన్మయుడై కుమారా! హనుమా! వింటివే ఆ నట రాజేశ్వర తాండవ విలాసంబు యిదియు అగస్త్యమహర్షి చెప్పిన చారిత్రక నిదర్శనము. మన మీ పవిత్రప్రదేశమున పరమేశ్వర ప్రాణ ప్రతిష్ఠ గావింత మని నిశ్చితాభిప్రాయము కలవాడై, హనుమంతునిచే తీసుకొనిరాబడిన కంద మూలములను గైకొని నిర్మలమైన నీటిని త్రాగి, ఆ రాత్రి చిగురుటాకులవలే నున్న మృదువైన పాన్పుపై నిద్రించి సుఖనిద్ర గడపి, వేకువనే మేల్కాని పరమేశ్వరుని ధ్యానించి కాలకృత్యములు ముగించుకొని హనుమంతుని చూచి 'బిడ్డా! అంజనీనందనా! నీవు శరవేగముగ వారణాసి వెళ్ళి విశ్వేశ్వరుని ఆరాధించి ఆశీస్సులను పొంది అందు తత్ప్రమాణలింగాకారమును తీసుకొని ముహూర్తము అతిక్రమింపక రావలయునని ఆనతిచ్చుటయే తడవుగా పవమానసుతుడు సాగిల బడి ఆకాశమార్గమున రామనామస్మరణ జేయుచు వేగముగ కైలాసనివాసి నివాసమగు వారణాసిని ప్రవేశించి విశ్వేశ్వరాలయమునకు వచ్చి అచ్చటి వైభవమునకు ఆశ్చర్యచకితుడై విశ్వేశ్వరుని నిష్ఠతో ధ్యానించి మైమరచియుండి కొంతసమయమునకు బాహ్యప్రపంచజ్ఞానమును పొంది దివాకరుని చూచి ముహూర్తము ఆసన్నమయినదని తలంచి తొందరగలవాడై పరమేశ్వరునికి నమస్కరించి పరమేశ్వరప్రమాణలింగాకారమును వెదకుటకు కాలము అతిక్ర మించునను తలంపు కలిగి గంగానదీతీమున అచ్చటచ్చట నున్న లింగము లను కొన్నిటిని వాలమున బంధించుకొని ఆ రాముడే తన ఇష్టలింగములను వెదకి పూజించునను తలంపుతో ఆకాశమార్గమున తిరిగి వేగముగా వచ్చుచుండె.

ఇచ్చట శ్రీరాముడు నిత్యస్నాన, సంధ్యాజప, హోమ, పూజాది విధుల నన్నిటిని పూర్తి గావించుకొని ముహూర్తసమయమున శివలింగము కొఱకు ఎదురు చూచి, చూచి, అగస్త్యమహర్షి చెప్పిన సమయము అతిక్రమించుట సముచితము కాదని అనేక విధముల చింతించి పశుపతిని అనేక విధముల ధ్యానించి నిమీలితనేత్రుండై యుండునంత పరమేశ్వరుడు స్వయంభూలింగ మును ప్రసాదించెను. ఇదియే ఈశ్వరానుగ్రహప్రాప్తమని తలంచి ఆ స్వయం భూలింగమునకు ప్రాణప్రతిష్ఠను చేసి భక్తితో షోడశోపచారవిధుల పూజించి మహారుద్రాభిషేక, బిల్వార్చనాదులను జరిపించి యిట్లు ప్రార్థించె—

శ్లో. నమస్తే పార్వతీప్రాణవల్లభాఽఽనందదాయక,
నమస్తే దేవదేవాదిపూజనీయపదాంబుజ.

శ్లో. నమస్తే శ్రీశ వాణీశ శచీశాద్యర్చిత ప్రభో,
నమస్తే నాగయజ్ఞోపవీతభూతిధరామల.

శ్లో నమస్తుభ్యం గిరీశాయ నమస్తుభ్యం పినాకినే,
నమస్తుభ్యం వరేణ్యాయ నమస్తుభ్యం కపాలినే

శ్లో. నమస్తుభ్యం శ్రితాభీష్టదాయినే కరుణాత్మనే,
నమస్తుభ్యం మహాపాపహారిణే వరదాయినే.

శ్లో. సర్వలోకశరణ్యాయ సర్వాభీష్టప్రదాయినే,
శర్వాయ సర్వరూపాయ శాంతాకారాయ తే నమః.

శ్లో పూర్వజన్మకృతం పాపం ఇహజన్మని యత్కృతమ్,
తత్సర్వం నాశయాద్య త్వం పార్వతీశ నమోస్తు తే.

ఈ విధముగా భక్తితో అనేక రీతుల స్తుతించి ప్రదక్షిణ సాష్టాంగ దండ ప్రణామంబులు అర్పించి కృతకృత్యు డయి ఆత్మశాంతిని పొంది సంతోష వదనము కలవాడయి యుండగ అంత ఆంజనేయుడు వచ్చి జరిగిన విషయ మును అవలోకించి అవమానమును పొంది మనస్సున బాధపడి ఏమియు తోచని వాడై నిలబడి కొంత సమయమునకు - 'దేవా! కాలాతిక్రమమునకు క్షమింప వలయును. నేను మీ యాజ్ఞ ప్రకారము కొన్ని శివలింగములను కొనితెచ్చినాను. పరిగ్రహింపు డనిన శ్రీరాముడు - 'కుమారా! నీకై ఎదురుతెన్నులు చూచి చూచి ముహూర్తమునకు సమయము మించుచున్న సందర్భమున విశ్వేశ్వరుని ప్రార్థించి స్వయంభూలింగమును ఇచ్చట ప్రతిష్ఠించితిని. ఇందులకు నీవు దుఃఖపడవలదు నీవు తెచ్చిన లింగములను యథాస్థితిని యుండునట్లు చేయుము' అనిన వాయు నందనుడు దీనవదనుడై - 'ప్రభో, మీ రిట్లాన తెచ్చిననే నేమనుదును? ఎట్లు తీసుకొని పోవుదును, నా ప్రయాస అంతయు వృథా చేయుదురా?' అనిన—

రాముడు - 'వత్సా! అయినదానికి చింత చెందవలదు. నీ యిష్టప్రకారము ఈ లింగములను అచ్చటచ్చట సముచితప్రదేశములందు ఉంచుము. దీనినిబట్టి వారణాసి పుణ్యక్షేత్రమునకు సాటిగా యుగయుగంబులు ఈ క్షేత్రము వెలుగొందుచుండు ననిన సమీరనందనుడు కోపముతో తనచే తీసుకొనిరాబడిన లింగములను ఇచ్చట యోగ్యము, అచ్చట అయోగ్యమని తలంచక తన తోకతో నూటొక్క లింగములను (ఏకోత్తరశత) విసరివైచెను. అంత ఆ లింగములన్నియు క్రమంబుగా కొన్నియు, అక్రమంబుగా కొన్నియు అచ్చటచ్చట పరిపరివిధముల పడియుండగా హనుమంతుని ఆగ్రహమును కనిపెట్టిన శ్రీరామచంద్రమూర్తి, ఈ క్షేత్రమును కేసరి (వానరము) క్షేత్రముగా అతని పేరున ప్రఖ్యాతి వడయునని పలికి హనుమంతుని ఓదార్చెను. అంత కొన్ని ఘడియల కాలము అచ్చట గడిపి శ్రీరాముడు హత్యాపాపమునుండి విముక్తుడై పుష్పకయానమున అయోధ్య చేరగా-

అంత ఆంజనేయుడు శ్రీ రామలింగేశ్వర సన్నిధానమున కొంతకాలము కేసరులతో (వానరము) వాసము చేసి, హనుమదీశ్వరు డను పేర ఒక లింగమును ప్రతిష్ఠ చేసి, సీతాదేవిని మనస్సున స్మరించి ఆత్మసాక్షాత్కారమును పొంది ఆమె అజ్ఞమేరకు అద్దానికి సమీపమున ఒక గుహయందు మహిషాసురమర్దినిని నిలిపి సీతాసరోవరమును స్థాపించి రామనామమును స్మరించుచూ నిజ మహేంద్రపర్వతము జేరెనని" దేవసేవి యను యోగిశ్రేష్ఠుండు శిష్యునకు వినిపించినంత రామశరణి, దేవదాసను ఇరువురు-'మహాత్మా, ఈ క్షేత్రమాహాత్మ్యమును' వివరించు సందర్భమున ఈ పుణ్యభూమి సచ్చరిత్రమునంతయును అమృతము వంటి మాటలలో మీవంటివారలనుండి సవిస్తరముగా విని ఆనందించితిమి. ఇంకను వినుటకు కుతూహలము కలుగుచున్నది వినిపింపవే! అదియునుగాక నీవు ఈ పర్వతభూప్రదేశములందు దర్శనీయస్థలంబులు ఎచ్చటెచ్చట కలవో అవి ఎల్ల మాకు చూపింపుమని వేడుచున్నవారము' అని వినయముతో విన్నవింప గురువరుండు- 'వత్సలారా! ఇట్లు నడువుడు. నా వెనువెంట నిగ్రహశక్తి గలవారై మనోనిర్మలతతో ధైర్యముగా రండు ఇదియే శ్రీరామప్రతిష్ఠాపిత పశ్చిమాభిముఖమైయున్న శ్రీరామలింగేశ్వర దేవస్థానము. ఇచ్చటనున్న స్వయంభూలింగమునకు సహస్రఘటాభిషేకము (వేయి కుండల జలముతో) చేసినను తీర్థమంతయు మనకెంతికి అగుపడక అంతర్లీన మగును.

ఇదియే దేవరహస్యము, ప్రత్యక్ష నిదర్శనము. స్వయంభూలింగమునకు కుడి భాగమున శ్రీనటరాజేశ్వరతాండవనాదము. అచ్చట గల దేవతలు, మనకంటికి అగుపడక అదృశ్యరూపమున నున్న మహర్షుల గాన, భజన శబ్దంబులు వింటిరే!

అటు చూడుడు, వామభాగమున పరాశక్తి పరమేశ్వరి పార్వతీదేవి విగ్రహము! ఇచ్చట ఒక సప్తకంబు (ఏడు రోజులు) నిష్కామియై ఒంటిపాదముపై నిలిచి ఇష్టదేవతోపాసన జేసిన మూడవరోజునుండి రాత్రి పూర్వయామంబున అదృశ్యరూపమున తిరుగుచుండు మహాత్ముల పదధ్వని, అవ్యక్త సంభాషణ వినబడును. ఇది యంతయు దేవపృష్ఠభాగమున జరుగునటుల నుండును. శిష్యులారా! ముందుకు నడువుడు. ఇదియే దేవాలయమునకు ప్రక్కభాగమున దేవతలచే త్రవ్వబడిన స్వామి పుష్కరిణి. ఇందు స్నాన పానాదులు జేసిన సర్వపాపములు నశించును. ఈ విచిత్రమును చూచితిరా! ఈ పుష్కరిణి నానుకొనియున్న పుష్పవృక్షముల తూర్పుభాగమునందు శిలా ఫలకవేదికపై కూర్చుండిన వైరాగ్య, జ్ఞానోదయము కలుగు. బాహ్య విషయ వాసనలు అంతరించు. కొంత నుత్తరఈశాన్యదిక్కుగా పోయి, చూచితిరే! పూర్వము మహర్షులు తపస్సు చేసిన బిలాంతరంబులు (గుహలు), అందు ప్రవేశించుట మహాకష్టము (ఇటు రండనుచు కొంత దూరము పోయి) చూడుడు ఈ పెద్ద శిలాఫలకము! దీని క్రింది భాగంబున హనుమద్విశిష్ట సీతామనోగత మహిషాసురమర్దని విగ్రహంబు కలదు. అటు చూడుడు. వ్యాఘ్రబిలంబు. అదియే హనుమదీశ్వర లింగము ఈ స్థలము బెబ్బులులకు నివాసయోగ్యము. ఇటురండనుచు కొంచెము దూరము పోయి ఇదియే సీతాసరోవరము, ఇచ్చటి నుండి పరిసరములయందు మునిజనమునకు అవసరమగు ఆహారానుకూల వన్య కందమూలఫలాదులును, నీవారసస్య పరిపూరిత ప్రదేశములు, చెరువులు అనేకములు యుండు.

ఇక పశ్చిమాభిముఖంబుగా పోవుదము అని నడచుచూ, చూడుడు ఇదియే కమలాకరతటాకంబు. ఇందలి నిర్మలమైన నీరు మహాశివరాత్రికి యాత్రకై వచ్చు అనేక వేల, లక్షల జనంబులకు స్నానపానాదులకు ఆధారమై యుపయోగ పడునది. అటు ముందుకు నడువుడు అని కొంతదూరము ముందుకు నడచి చూడుడు. ఇవి దేవతలచే త్రవ్వబడిన గుండంబులు. ఈ తీరు క్రమబద్ధమై

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల నామములచే ఒప్పి ప్రకాశించుచున్నవి. ఇక నడువుడు వెనుకకు అని నైరుతిదిశలో ఒక కొండ కోనకు చేరి, వత్సలారా!— ఈ గహనప్రదేశంబునుండియే కొండలోనికి వెళ్ళుటకు త్రోవ యున్నదని విందు. అందు చేరుట శక్యము కాదన శిష్యులు - గురుదేవా! యిది యేమి వింత? తమ బోటి మహాయోగులకే అతికష్టమై యుండ మా బోటివారల గతి చెప్పనేల? కావున ఎట్లు పోవుటకు వీలుపడునో చెప్పి సందేహమును నివారింపవే యని ప్రార్థింపగ అపుడు మహాయోగి-'శిష్యులారా! నిర్మల మనస్సు కలవారై వినుడు. ఆ గుహాద్వారము కనుగొనుట, అందు ప్రవేశించుట సామాన్య విషయము కాదు. కొంతకాలము వాయుభక్షకులై, కోరికలు లేనివారై అత్యంతభక్తితో ఈశ్వరుని ఆరాధించి, తపంబు జేసి ఈశ్వరుని అనుగ్రహమును పొందిన మహామహులకే యిది సాధ్యము.

అదియునుగాక, నేను కొంతకాలముక్రింద ప్రయత్నించినవాడనై నిగ్రహ పూర్వకముగా ఈశ్వరుని అర్చించి, చేత జపమాల ధరించి, విశ్రాంతి యనునది లేక అహోరాత్రములు ఉన్మాదులవలె అచ్చటచ్చట తిరుగుతూ పరిసరప్రాంతమంత యును వెదకుచుండ అంతలో ఒక పెద్దపులి కంటికి అగుపడినంత నేను తదేకధ్యాన మున నుండ దూరమున జటాకౌపీనధారియు, హస్తమునందు యోగదండము ధరించి, ప్రకాశమైన శరీరముతో తగినంత సౌష్ఠవమైన అంగములు కలవాడు నాకు కనబడినవాడై, చిరునవ్వు నవ్వి, రెండు చేతులు పైకెత్తి ''వద్దు వద్దు'' అని వారించువిధమున సైగ చేసి ఆశీర్వాద అభయహస్తమును చూపి అదృశ్యు డయ్యెను. పూర్వము ఒక మహర్షిచే ఈ గుహాప్రవేశ రహస్యమును గూర్చి విని యుంటిని. అదియును మీకు వినిపింతును. అది ఏమనగా, ఆత్మశక్తి దేవతాను గ్రహము లేనివాడు పోవుటకు ప్రయత్నించరాదు. సాహసించి ప్రయత్నించిన క్రూరజంతువులు అడ్డగించును. అవి దాటిన శూర్పాకారము గల తేళ్ళు, అంతకు మించిన స్థలకూర్మంబులు (తాబేళ్ళు), వాటిని మించి శ్వేత, రక్త, కృష్ణ నాగజాతి పాములుండు. అవి యన్నియు కలియుగమానవులకు ప్రవేశించుట వీలుగా కుండుటకై మహర్షులు తమ తపశ్శక్తితో నిర్మాణము గావించిన యంతరాయ ములు. వింటిరికదా, ఇక మనము సాహసింపరాదు.

కావున నడువుడు. పర్వతము నెక్కుదము అనుచు గట్టుపై కెక్కి ద్వారము దాటి హనుమంతుని దర్శనము జేసుకొని, అంతేవాసులారా! అటు

చూడుడు - క్రమము దప్పి పడియున్న శివలింగపరంపర యన శిష్యులు కను లారా జూచి సంశయమనస్సు కలవారై, గురువర్యా! అవియన్నియు సరియైన పద్ధతిలో లేక పనికిరానివై వదలి పెట్టుటకు గల కారణము సెలవిండన యోగివ రుండు - 'శిష్యులారా! మీ రడిగిన ప్రశ్నకు ఒక రహస్యంబు బయల్పడును. వినుండు- అపరరుద్రావతారుడగు వాయుకుమారుడు శ్రీరామాజ్ఞచే లింగంబులను కొంచెము ఆలస్యముగా దెచ్చునంత ప్రతిష్ఠ పూర్తియగుట చూచి దుఃఖించి నేను దెచ్చిన లింగములకు నా ఆరాధ్యదైవస్వరూపుడు ఆ రాముడే పూజింపకుండగ నేను ఎట్లు పూజించుట, తిరిగి వీటిని తీసుకొని పోవుట అసంభవము. వీటిని ఉచితమైన స్థలంబులందు పెట్టుట నా చేత జరుగునది కాదు. ఏలయన, సంతత రామనామస్మరణ చేయుటకు అంతరాయము కలుగునను తలంపుతో ఈశ్వర ఇచ్ఛానుసారముగ నుండుగాక యని తన తోకతో కోపముగా విసరివైచెను. ఆ విధముగ ఈ రీతిన పడియున్న యవి శుభముహూర్త అతిక్రమణ దోషంబు బట్టి నిత్యపూజాదులు లేక పడియుండె, యింతయే గాని ఏ కారణము లేదు.

ఇట్టి లింగములు కాశీక్షేత్రమునందు మాత్రమే కలవని పెద్దలు చెప్పగా విందు. ఇక నడువుడు ముందుకు' అని ప్రాక్‌దిశగా కొంత దూరము వెళ్ళి, 'చూడుడు - ఇటునుండి చూచిన శ్రీ రామలింగస్వామి దర్శనంబు అగు' ననుచు బోధించు గురువర్యుని గాంచి ఈ ఆలయ శిఖరనిర్మాణము ఏ యుగంబు నాటిది? ఏ పుణ్యపురుషులచే నిర్మించబడినది? వినిపింపు డన - దేవసేవి యోగిపుంగవుడు కొంత ముందుకు నడచి సమమైన రాతిపీఠము సందు నిలుచుండి నిమీలితనేత్రుండై ఉత్తరాభిముఖము కలిగి ఆలోచించి కనులు విప్పి కలయజూచి, వత్సలారా! అటు చూడుడు - ఉత్తర, వాయవ్య దిశమధ్య ఒక కొండ యగపడుచున్నది పరిశీలింపుడు. ఆ కొండ పై భాగము సమతలమై యున్నది. అచ్చట కొన్ని వందల సంవత్సరములకు పూర్వము రెడ్డికులమునకు చెందిన గోనరాజులు కేవలము పశుపతిపాదారవిందభక్తులై సత్యధర్మపరా యణులై రాజ్యము నేలుచు శత్రుతురుష్కరాజన్యుల బారినుండి రక్షించు కొనుటను ఈ అరణ్యమున కనబడు ప్రదేశంబున పండితులతోను,మిత్రులతోను, సైన్యములతోను కూడినవారై నివాసమేర్పరచుకొని ఈశ్వరుని ఆరాధించుచు విజయమును కోరి ఇట్లుండ కొంత కాలము గడచినకొలది శ్రీ రామలింగేశ్వర అనుగ్రహమున విజయులై శ్రీ స్వామివారికి దేవాలయగోపుర ప్రాకారంబులు నిర్మించి తాముండు ప్రదేశమున ఒక శివలింగమును ప్రతిష్ఠ చేసిరి.

దానికి సమీపమున అచ్చట నున్న పద్మసరోవర సామీప్యమున ఆ గోన రాజుల సభాస్థలంబులు మెండు కలవు. అదియును గాక అచ్చట అనేక గుహలు కలవు. బిలంబులు కలవు. ఈ ప్రాంతారణ్యమంతయు క్రూరమైన పులులతోను నక్కలతోను వాటి సంతాన నివాసమునకు అనువుగా నుండుట కలదు. ఇదియ ఈ ఆలయ నిర్మాణ కథాకథనము, వింటిరే' యనుచు దేవాలయము ప్రవేశించి అచ్చట నైరుతిదిశగా నున్న మత్స్య, కూర్మ, వరాహ, ఆంజనేయ, విఘ్నేశ్వర అవతారంబులు కల అతి పెద్ద శిలాధ్వజస్తంభము చూచితిరే యనుచు ఈ స్తంభముపై యున్న అవతారము లన్నియు వైష్ణవమత సంబద్ధములు. స్తంభ శిఖరముపై ఈశ్వరసంబంధితలింగము, నందియు శైవసంబంధితము. వారిమధ్య ఏ కలహము ఉండరాదని శైవ - వైష్ణవ అభేదము చెప్పబడి యుండునట్లు కాన్పించుచున్నది. ఈ విధముగా దేవాలయ ప్రాంగణంబున దేవతోపాసన జేయుచు కొంతకాలము విశ్రాంతిగా నుండ, మధ్య మధ్య పెద్ద పులులు, సింహములు, నాగసర్పములు కరతల సమానకోశములతో కూడి తోకతో కూడి కొట్టబడిన రాళ్ళకు రంధ్రములు కలవిగా నున్న వృశ్చికములు కనబడి భయోత్పాతములను కలుగజేసినప్పటికి భయపడక నుండగా—

ఒకనాడు గురుదేవుల విశ్రాంతి సమయము తరువాత అంతేవాసులు 'దేవా! ఈ పుణ్యప్రదేశంబు తాపస, యోగి, సాధువులకు అనుకూలంబై ఇతర సర్వ మానవులకు అనుకూలంబై యుండుట మంచిది. కాన, సర్వదా అహోరాత్రులు సాధుమానవసందోహముతో, సర్వజన ఆదరణతో సేవ్యంబై నిత్యోత్సవాదులతో విరాజిల్లునటుల ఏవిధంబుగనైనను కష్టమునకు ఓర్పు వహించి ప్రయత్నించవే యన - యోగివరుండు శిష్యులతో మీరు తలంచిన కార్యము కష్టముతో కూడు కొన్నది అది యిప్పుడిప్పుడు నెరవేరుట కాని పని. పరమేశ్వర ఇచ్ఛానుసారమై యున్నది. కాన మన మందరము ఏకనిష్ఠతో కొంతకాలము జప, ధ్యాన నిష్ఠులమై ప్రయత్నించిన అనుకూలకాలము అతి త్వరలో రాగలదని దృఢ విశ్వాసము కలదు' అని యుపకారబుద్ధితో ఈశ్వరుని ఆరాధించుచూ యున్న నొకనాడు యోగి.-'శిష్యులారా! శ్రీరామలింగేశ్వరుడు స్వప్నమునందు కనబడి మీరు తలంచిన కార్యము లోకోపకారయుక్తమైనను ఇపుడు పొసగదు. ఇంకా కొన్ని వందల సంవత్సరముల కాలము గడచిన గాని అది వెల్లడి కాదు. ఇది సత్యాతిసత్యము. నిండుహృదయులై యుండుడు అని నుడివెను. ఈ క్షేత్రంబు

మహర్షిజనసేవితము. శ్రీరామరాజప్రతిష్ఠిత స్వయంభూలింగప్రదేశము. కేసరి యను వానరసంజాతుడైన హనుమంతుని కేసరిగా శ్రీరాముడు అభివర్ణించెను.

నాటి నుండి "కేసరిగిరి" యను నామమున ఈ క్షేత్రము సార్థకమై యొప్పారుచున్నది. కావున శ్రీ విశ్వేశ్వర నివాసమగు వారణాసి కన్న మిన్నయై ద్వాదశ (12) జ్యోతిర్లింగములను అధిగమించినదై ఇహపరసుఖములకు ఆల వాలమై, భక్తిముక్తిప్రదంబై, సర్వజనహృద్యంబై అలరారుచుండు నని ఈ విధంబుగా అంతేవాసులకు దేవసేవి మహాయోగివరుండు శ్రీ కేసరిగిరి రామ లింగేశ్వర క్షేత్ర మాహాత్మ్యాదులను తెలిసినంత వివరించె

శ్లో. ఏతత్ కేసరిశ్రీరామలింగేశ్వరకథానకమ్,
యే శృణ్వంతి నరాస్తే వై సర్వాన్ కామాన్ సమాప్నుయుః.

ఈ సచ్చరిత్రమును ఎవ్వరు భక్తియుక్తులై చదివెదరో, వినిపించెదరో వారు శ్రీరామలింగేశ్వరానుగ్రహంబున సకల కోరికల ననుభవించి ధన, ధాన్య, పుత్ర, పౌత్రాభివృద్ధి కలవారలై, భూమిపై సర్వసుఖములను పొంది దీర్ఘాయురారోగ్యంబు లను పొందెదరు.

## ఏతన్మాహాత్మ్యశ్రవణపఠనఫలశ్రుతిః

శ్లో. ఇత్యుక్తాం దేవసేవేన సభవిష్యాం సహోత్తరామ్,
శృణుయా ద్యః పఠేద్భక్త్యా కథాం పుణ్యాం పురాతనీమ్,
స తు భుక్త్వాఽఖిలాన్ కామాన్ అన్తే శివపదం వ్రజేత్.

# శివరాత్రి మహిమ

గీ. "అష్టమియు సోమవారంబు నసితపక్ష
మందలి చతుర్దశియు శివహర్షకరము
లందు శివరాత్రి యున్నతంబై యలరుట
న్నావ్రతం బెల్లరకు ముఖ్యమై తనర్చు (శివపురాణము)

"ఆదిమధ్యాంతరహితుడైన ఆ పరమేశ్వరుడు ఈ అండపిండబ్రహ్మాండ మంతటా అణువణువునా నిండియున్నాడు సుమా!" అను దివ్యోపదేశస్వరూపమే యీ లింగస్వరూపము. శివునికి ఆరాధ్యదినములు పది. వాటిలో నాలుగు సోమవారములు, రెండు అష్టములు, రెండు ఏకాదశులు, రెండు చతుర్దశులు. ఇహపరములను గోరువారలు యీ పర్వములలో న్యాసపూర్వక జప, హోమ, అర్చన, అభిషేకములను సల్పి తరింపవలయును. "అభిషేకప్రియ శ్శివః". ఈశ్వరుడు అభిషేకప్రియుడు. ఈ అభిషేకములు అవర్తనాభిషేకమని, రుద్రియని, లఘురుద్రియని, మహారుద్రి యని, అతిరుద్రి యని ఐదువిధములుగా మేరుతంత్రము వివరించుచున్నది. అర్చన చేయుటకు స్థిరలింగార్చనరూపమున గాని, పార్థివలింగార్చనరూపమున గాని చేయవచ్చును.

మాఘకృష్ణత్రయోదశినాడు ఏకభుక్తము చేసి చతుర్దశినాడు పూర్తిగా ఉపవాస ముండవలయును. శివరాత్రినాడు సాయంకాలమున శివాలయమునకు పోయి స్థిరమతితో శివపూజ ప్రారంభించవలయును. పూజకు వలయు సకల ద్రవ్యములను సమకూర్చుకొని మంగళవాద్యపురస్సరముగా వేదమంత్రపఠనముతో సాయంత్రము గుడి కేగి స్నానసంధ్యాదులు చేసుకొని, పవిత్రుడై ఆచార్య ఋత్విగ్వరణము చేసి నాల్గుజాములందును ఉక్తరీతిని శివపూజ చేయవలయును. గౌరీతిలకము అను మంటపమును ఏర్పరచి దాని మధ్య లింగతోభద్ర మనెడు మండలమును రచించి చుట్టును పదునొకండు కలశములను వస్త్ర-ఫల-సువర్ణ సహితముగా నుంచి తన్మధ్యమున కనకకలశమును ఆరాధించి అందు శివ పార్వతుల సువర్ణప్రతిమ నుంచి యథావిధి అష్టోత్తరశతముగ రుద్రగాయత్రి

జపించి, పునుగు కలిపిన గంధమును యిచ్చి శ్వేతాక్షతలు-నల్లనువ్వులు-గన్నేరు పూవులు, పద్మములు, బిల్వపత్రములతోను (చదువుచూ) పూజింపవలయును. ఆ తరువాత ధూప, దీపము లిచ్చి పంచభక్ష్య పరమాన్నములను నివేదన చేయవలయును. బిల్వఫలార్ఘ్యముల నిచ్చి తాంబూల, నీరాజనముల నొసగి మంత్ర పుష్పాదుల పఠనము గావించి సత్బ్రాహ్మణులను పిలిచి వారికి అన్నదానము చేసి నృత్య-గీత-పురాణ శ్రవణాదులతో రాత్రి నాలుగుజాములను గడపి సూర్యోదయమైన పిదప స్నాన, సంధ్యావందనములను ముగించుకొని లక్షబిల్వార్చన గావించి, విప్రులకు దానము లొసరించి, పూర్ణాహుతి చేసి, ఆచార్యసత్కారముల నుడివి, స్వామివారికి అభిషేకము గావించిన తీర్థప్రసాదములను స్వీకరింపవలయును. ఇట్లు శివరాత్రినాడు నాల్గు యామములు పూజించిన అనంతఫలము లభించును. శివరాత్రి ఉపవాసము జేసి, జాగరణము గావించి మంచుబిందువులచే తడసిన బిల్వపత్రములతో పదునాలుగు సంవత్సరములు నియమముగా ఏ మనుజుడు పూజించునో ఆ మనుజుడు శివసాయుజ్యమును పొందును. అట్టివారికి పరమేశ్వరుడు అష్టైశ్వర్యముల నిచ్చి ఆచంద్రార్కము వంశాభివృద్ధిని కలిగించి, సకల పాపములను నశింపజేసి, దివ్యదేహంబుల నిచ్చి శివసాయుజ్య మిచ్చును. ఒకవేళ ఈ శివరాత్రి మహిమ తెలియక చేసినను మహాఫలము నిచ్చును. ఎట్లనగా—

పూర్వము అర్బుదాచలసమీపారణ్యమున గురుద్రహుడను బోయ డొకడు కలడు. అతడు నిత్యమును అడవిమృగములను వేటాడి చంపుచూ బాటసారులను దోచుచూ, మహాక్రూరుడై జీవించుచుండెను. ఆ రోజు శివరాత్రి, గత దినమున ఏ జంతువును అతనికంట పడనందున ఆ గురుద్రహుని కుటుంబమంతయు ఉపవాసమున్న స్థితి ఏర్పడినది అంత ఆ బోయ వేట కరిగి అడవిని తిరుగుచుండెను. సూర్యాస్తమైనది. వట్టిచేతులతో యింటి కరిగి తల్లిదండ్రులను, ఆలుబిడ్డలను, ఎట్లు చూతునని వాడు మిగుల పరితాపపడుచు ఒక చెఱువు చెంతనున్న మారేడు వృక్షము నెక్కి నిరీక్షించుచుండెను.

అంతలో ఆ చెఱువు నీరు త్రాగుటకు అట ఒక ఆడులేడి రాగా, ఆ బోయడు వింటి నెక్కుపెట్టెను. ఆ ప్రయత్నమున ఒక బిల్వదళము తెగి ఆ చెట్టు క్రిందనున్న శివలింగముపై మంచు బిందువులతో కూడి పడెను. అప్పుడా

మృగి బోయను గాంచి నా బిడ్డలను నా భర్తకు, నా చెల్లెలికిని అప్పగించి తిరిగి వచ్చి నీకు ఆహార మగుదునని ప్రార్థించెను. కాని భిల్లుడు నవ్వి తిరస్కరింపగా ఆ లేడి అనేక ప్రమాణములు జేయగా వెళ్ళి రమ్మని విడిచెను. అపు డా మగలేడి నీరు ద్రావి తన స్థానమున కేగెను.

అంత ఆ హరిణము కుటుంబ మంతను కలసికొని కిరాతకునికి ఆహారముగ నేను వెడుదునంటె నేను వెడుదునని ఒకరికొకరు ప్రతివాదము లాడుచు వ్యాధునికడకు వచ్చి వరుసగా నిలచినవి. అపుడా బోయవాడు మృగముల గుంపును చూచి ఉప్పొంగుచూ అత్యానందుడై వాటిమీద బాణముల నేయు ప్రయత్నమున తోయబిల్వ దళములు కొన్ని శివలింగ శిరమున పడినవి. ఇట్లు నాలుగుజాములు గడచి సూర్యోదయము కాగా అజ్ఞానము వీడి విజ్ఞాన ముదయించి జ్ఞానము లేని మృగము లిట్లు పరుల కొరకయి ప్రాణసమర్ప ణంబునకు సిద్ధపడుచుండ జ్ఞనము తెలిసిన మానవుడైన నేను తిండికి ఆశపడి వీటిని వధింపజూచుట ఎంతటి మూర్ఖమగు కార్య మని తలచి ఈ వృత్తిని వదులుదు నని నిర్ణయించుకొని, ఆ మృగములను ప్రేమతో నిమిరి, పోయి రండని విడ చెను.

అంత వ్యాధుడు అజ్ఞానవశమున చేసిన శివరాత్రి ఉపవాసమునకు, జాగరణమునకు, ఆ రాత్రి యంతయు చల్లని మంచుబిందువులచే తడసినందుకు, తనకు తెలియకయే బిల్వపత్రము లన్నియు నాలుగుజాములందు శివుని శిరస్సున పడి అర్చించినందుకు శంకరుడు సంతసించి సాక్షాత్కరించి గురుద్రహునితో నీ సకల పాపములను నశింపజేసి పరిశుద్ధుడను జేసితిని. నీవు యిప్పటినుండి "గుహుడు" అను నామమును పొంది అచ్చటనుండు నిషాదుల కెల్ల ప్రభువై యుండుము. కొన్ని సంవత్సరములకు నీకు దాశరథి యగు శ్రీరాముని సంద ర్శనము కాగలదు అపుడు నీకు సంపూర్ణసాయుజ్యము నిత్తునని అనుగ్ర హించెను. అంత ఆ జింకలకును దివ్యదేహంబు లిచ్చి సాయుజ్య మిచ్చెను. కావున - శివరాత్రినాడు తెలియక నాల్గు యామము లిట్లు అర్చించిన అనంత ఫలము లభించును. ఇంద్రభట్టారకవర్మ అను నతడు ఘటికాస్థానమున విశ్వ విద్యాలయము నెలకొల్పినట్లు కలదు. అట్టి ఘటికాస్థానము ఇచ్చటికి సమీపమున నున్న ఘట్ కేసర్ వద్ద నెలకొల్పి యుండవచ్చును. అతడును ఈ వంశమునకు చెందినవాడే.

ఈ క్షేత్రముపై పశ్చిమ దిశగా ఈ వాయవ్య మూలగ పెద్దబండ కలదు. ఆ బండ గోన కోటారెడ్డి బండ యను నామమున కర్ణాకర్ణికముగా పూర్వులనుండి వ్యవహరింపబడుచున్నది. గోనరాజులలో (34)వ నాయంకరుడు గోన కోటారెడ్డి గోన రాజుల కోటగా 12, 13వ శతాబ్దములయందు ఈ ప్రాంతమును జయించి విజయచిహ్నముగా విజయస్థూపములను నాటియుండుట స్పష్టముగా కనబడుచున్నది ఇచ్చటివారు స్థాపించిన విజయస్తంభముపై మత్స్య, కూర్మ, వరాహ, విఘ్నేశ్వర, హనుమంతుని చిత్రరువులు చెక్కబడియుండుట ఇప్పటికిని కనులార కాంచవచ్చును. ఈ క్షేత్రమున నుండి వారు విజయులైనందుకు ఈశ్వరుని కృపాకటాక్షముచే గోనరాజులు దేవాలయ గోపుర ప్రాంగణమున నున్న శివలింగములకు యోగ్యమైనటుల చతురస్రాకార, రాతి స్తంభ మంటపములను, ఇటుకలతో గోడలను, గోపురములను కట్టించియుందురని వారి చిహ్నములనుబట్టి చరిత్రకారుల యూహ.

# చారిత్రక హైందవ సంస్కృతి

హిందూమతానికి అప్పటికి ఇప్పటికి దర్పణాలుగా నిలిచి యున్న మన దేవాలయాల సంస్కృతిని పరిరక్షించుకోవడం మన విధ్యుక్త ధర్మము. ఈ కేసరిగిరి పూర్వము ఒక పుణ్యక్షేత్రమేకాక చుట్టూ పర్వతశ్రేణులచే ఆవరించబడి శత్రుదుర్భేద్యమైన ఒక మహానగరంగా యుండినట్లు చారిత్రకాధారముల వల్ల తెలియుచున్నది. ఇచ్చట యజ్ఞవాటికలు, విగ్రహములు, భవనములు, వెండి, బంగారు, రాగి నాణెములు, ఆలయములు, వాటి నాధారముగ ఇటీవల త్రవ్వకాలు జరిపిన పురావస్తుశాఖవారు క్రీ.శ. 4 నుండి 6 వ శతాబ్దములకు చెందిన విష్ణుకుండినుల రాజులు, వారిలో మొదటి మాధవవర్మ, రెండవ మాధవవర్మలు శైవమతవ్యాపకులై ఈ క్షేత్రమున రాజ్యస్థాపన చేసిరని భావించవచ్చును. ఈ క్షేత్రము చుట్టూ శిథిలమైపోయిన కోటగోడ యిప్పటికిని కనిపించుచున్నది. విష్ణుకుండినుల వంశంలో ముఖ్యుడైన మాధవవర్మ పదకొండు అశ్వమేధాలను పౌండరీక, వాజపేయ, సర్వమేధ, రాజసూయ, పురుషమేధ మొదలైనవి సహస్రక్రతువులు చేసినాడట. నాలుగు దిక్కులను జయించి రాజ్యమునకు సార్వభౌమత్వమును వహించి రనుటలో సందేహము లేదు. ఇందులకు ప్రత్యక్షనిదర్శనముగా చతురస్రాకార యజ్ఞవాటిక ఈ క్షేత్రమున త్రవ్వకాలలో బయల్పడినది.

చరిత్రను పరిశీలించగా క్రీ.శ. 1199 నుండి 1261 వఱకు కాకతీయులు ఆంధ్రదేశమును ఓరుగల్లు ముఖ్యపట్టణముగా చేసుకొని పరిపాలించినట్లు తెలియుచున్నది. క్రీ శ. 1266 నుండి 1286 వఱకు ఢిల్లీ చక్రవర్తిగా బానిస వంశీయుడైన బాల్బన్ పరిపాలించెను. క్రీ. శ. 1296 నుండి 1316 వఱకు అల్లాయుద్దీన్ ఖిల్జీ ఉత్తరహిందూస్థానమునే కాక, దక్షిణదేశమును కూడా జయించినాడు. అట్లు జయించిన రాజ్యములలో యాదవరాజ్యం, కాకతీయరాజ్యం, హొయసాల రాజ్యములు ముఖ్యమైనవి. చరిత్ర ఆధారమునుబట్టి 1261 వ సంవత్సరము నాటికే కాకతీయ సామ్రాజ్యము క్షీణదశలో నున్నది. క్రీ శ. 1261 - 1347

వఱకు తెలంగాణా ప్రాంతమును ఎవరు పరిపాలించా రన్న ప్రశ్న ఉదయించక మానదు ఈ సమయమున కేసరిగిరి (కీసరగుట్ట)ని రాజధానిగా చేసుకొని గోన రాజులు రాజ్యపరిపాలన గావించినట్లు ఊహింపతగును. క్రీ శ. 1296 నుండి 1316 వఱకు ఢిల్లీ చక్రవర్తిగా నుండిన అల్లాయుద్దీన్ ఖిల్జీ ఈ ప్రాంతమున గోనరాజులతో యుద్ధము చేసినట్లు భావించవచ్చును. క్రీ. శ. 1325 - 1351 వఱకు మహమ్మద్ బీన్ తుగ్లక్ ఢిల్లీ చక్రవర్తిగా నుండి అనేక రాజ్యములను జయించినట్లుగా తెలియుచున్నది. అదే సమయమున రెడ్డిరాజులతో యుద్ధము చేసినట్లు భావింపవచ్చును.

గుల్బర్గాను రాజధాగా చేసుకొని హసన్‌గంగు బహుమని, ఆ తరువాత 18 మంది రాజులు 1347-1507 వఱకు ఢిల్లీసుల్తాను నెదిరించి బహుమని రాజ్యమును స్థాపించి పరిపాలించిరి. 1507-1589 వఱకు బహుమని రాజ్యసుబేదారు సుల్తాన్ కులీ కుతుబ్‌షా వంశస్థులు స్వతంత్రరాజ్యంగా గోలుకొండ సామ్రాజ్యమును పరిపాలించిరి. ఆ వంశమునకు చెందిన 5 వ మహమ్మద్ కులీ కుతుబ్‌షాహ 1589 సం.ము తన ప్రియురాలి పేర భాగ్యనగరమును కట్టించి సామ్రాజ్యమును పరిపాలించెను. అదే వంశమునకు చెందిన 7 వ వాడగు అబుల్‌హసన్ తానీషా 1687 వ సం.ము పాలన చేయుచుండగా ఔరంగజేబుచే చెరబట్టబడెను.

గోలుకొండను పరిపాలించిన అబుల్‌హసన్ తానీషావద్ద అక్కన్న, మాదన్న లిరువురు మంత్రులుగా నుండి, తమ పేర ఆలయములను నిర్మింప తలచి కావలసిన శిల్పవిగ్రహము లన్నియు సమకూర్చి అనాటి సమాజంలో చెల రేగుతున్న శైవ-వైష్ణవ మతాల పరస్పర సంఘర్షణాన్ని శాంతింపజేసే సదుద్దే శంతో ఆలయనిర్మాణము గావించ తలంచిరి. అట్టి సమయమున ఈ కేసరిగిరి క్షేత్రమున నరసింహస్వామిమూర్తిని ప్రతిష్ఠింపదలచి అదే సమయమున మౌలాలి గుట్టపై నరసింహస్వామిని స్థాపింపదలచిరి. నిర్ణయించిన ముహూర్తసమయము నకే గోలుకొండ పాలితరాజైన ఢిల్లీ సుల్తాన్ ఔరంగజేబు ఆ విషయమును తెలుసుకొని స్వమతాంతరులను అదే సమయమునకు తలలు నరికించా డను ప్రతీతి కలదు. అందువలన నరసింహస్వామి విగ్రహము ప్రతిష్ఠ కాక ఇప్పటికి ఆ ఆలయమునందు మూర్తితోను, మరియు ఆళ్వారుల విగ్రహములతోను, కూర్మావతార విగ్రహముతోను సుందరముగా నున్న ఆలయము వెలవెల పోవుటను గమనింపవచ్చును.

అడుగడుగునా కనిపిస్తున్న ఈ పురావస్తుసంపదలో చతురస్రాకారపు గర్భాలయంలో రాతి స్తంభాల ముఖమండపములో జైనదేవాలయావశేషాలు కూడా ఈ ప్రాంతమున అడుగడుగునా కనిపిస్తున్న ఈ పురావస్తుసంపదలోని ఒక భాగమే. ఈ జైనదేవాలయమునందు అన్ని హంగులు కలిగియున్న ఒక జైన విగ్రహము శిథిలావస్థలో నున్నట్లు ఇప్పటికి ఇచ్చట దర్శించవచ్చును.

సుల్తానులు పరిపాలన 1687 వరకు సాగించిరి. అదే సంవత్సరములో ఔరంగజేబు గోల్కొండను మొగలు సామ్రాజ్యంలో కలిపివేసుకొన్నాడు. మొగలుసామ్రాజ్య విచ్ఛేదానంతరము నిజాంనవాబులు తెలంగాణా ప్రాంత మును పరిపాలించినారు ఆ సమయమున ఈ ప్రాంతమంతయు ముస్లిం మత వ్యాప్తికై జాగీరులను వారి మతస్థులకే ఇచ్చినారు. కొన్నివందల సంవత్సర ములు తురుష్కులు మన దేశాన్ని వంశపారంపర్యంగా పరిపాలించారు. నిజాం నవాబుల కాలంలో ఎన్నో కట్టడాలు హైదరాబాదులో నిర్మించారు

## నవీన చరిత్ర

సుమారు 4 వందల సంవత్సరముల మాట. కీసరగ్రామం తురక జాగీరులు పరిపాలించు సమయము. ఇదంతా మనుష్యసంచారములేని కొండ చరియల నానుకొని యున్న అడవి ప్రదేశము. తాపసులకు యోగ్యమైన ప్రదేశము. నిర్మానుష్యప్రదేశము. ఆశ్వయుజ మాస శుద్ధపాడ్యమి 1930 సంవత్సరము. తాపసులకు యోగ్యమైన స్థలమును అన్వేషించి కేసరిగిరి తగిన స్థానమని నిర్ణయించుకొని మేడ్చల్ తాలూకా రంగారెడ్డి జిల్లా రాంపల్లి గ్రామ నివాసి గొంగులూరు గుండయ్య శాస్త్రిగారి మనుమడు నరహరిశాస్త్రిగారి ప్రియతమ పుత్రుడు శ్రీమాన్ శ్రీ శంకరశాస్త్రిగారు, మరియు కీసర గ్రామ నివాసి తటాకం శ్రీ రామలింగయ్యగారు ఈ క్షేత్రముపై పూర్వులచే పూజితు డైన శ్రీ రామలింగేశ్వరస్వామిని కనులారా దర్శించి, పూజించి, వారి తాతలు, ముత్తాతల ఆరాధ్య దైవమైన స్వామిని మనసా, వాచా స్మరించి, కొన్ని సంవత్సముల కాలము నిరాహారులై అటుకులు, శెనగలు నీరును మాత్రము తీసుకొంటూ ఉన్మాదులవలే ఈ ప్రాంతమంతయు తిరిగి రామలింగేశ్వరస్వామి సన్నిధిని స్థాన మేర్పరచుకొని కొంతకాలము తప మాచరించి అనేక కష్టనష్ట ముల కోర్చి అనుభవము నొంది తన కళ్ళ ఎదుటనే ఎన్నో చిత్రవిచిత్రము

లన్నియు గాంచిరి. వారి అనుభవములను కొన్నిటిని యథాతథముగా యిందు పొందుపరచడమైనది.

అది ఆశ్వయుజమాసం. కాశిగడ్డి నిలువెత్తు పెరిగి ప్రకృతిరమణీయమును గొలుపుచుండగా వీరు నడచుచున్న ఒక ప్రదేశమునందు వారి కాళ్ళ ముందచే మంచి నాగుసర్పము కనిపించినంతనే వారు నిశ్చేష్టులై నిలిచిరి. కాని పడగ విప్పిన ఆ సర్పము కొద్ది నిముషములుండి వెంటనే అంతర్ధానమయ్యేను సాయం కాల సంధ్యావందన సమయముతో చేయెత్తు మనుష్యులు తెల్లనివస్త్రధారులై పద్మసరస్సు దగ్గరకు వచ్చి వెళ్ళేవారు. "శ్రేయాంసి బహువిఘ్నాని'' అన్నట్లు తపస్సు చేయుచున్నప్పుడు అనేకమైన శబ్దములు వారి చెవికి వినబడేవి ఒక పర్యాయము తదేకధ్యానులై యుండగా ఒక నాగసర్పము లింగమును ఆలింగ నము చేసుకొని యుండియుండగా ధ్యానానంతరము చూడగా కొద్దిక్షణములవఱకే యుండి కనబడకపోయినది. అంతట సాయంకాలసమయమున ఆలయమునకు సమీపమున నున్న బూరుగచెట్టు కొమ్మ చాలా పొడవుగా (లింగమును తాకు నట్లుగా) యుండి చేయెత్తు మనుష్యులు దానిపై వ్రేలాడినట్లు పరికించి చూడగా మరల ఆ కొమ్మ కృశించిపోయినట్లు మరి యెన్నో అద్భుతములైన సత్యము లన్నియు సవిస్తరముగా వివరించిరి. పూర్వమునుండి తటాకం వారు శ్రీ భవానీ రామలింగేశ్వరునకు వంశపారంపర్యపూజారులుగా ఇప్పటికి జరుపుతున్నారు. వారిలో—



నారాయణ పెద్దకుమారుడు తటాకం రామలింగయ్య ఈ ఆలయ సకల పురోభివృద్ధికి స్వధనము నంతయు వెచ్చించి కీసరగ్రామమునుండి విద్యుద్దీపాలను తెప్పించుటకు అహర్నిశలు పాటుపడిరి. శ్రీ ఈశ్వరయ్యగారు వంశపారంపర్య ధర్మకర్తలమండలి అధ్యక్షులుగా కొనసాగుచున్నారు.

## రెడ్డిత్రయము

17, 18, 19వ శతాబ్దాలలో నామమాత్రావశేషముగా నుండిన శ్రీరామలింగేశ్వరస్వామివారి క్షేత్రము జీర్ణావస్థనుండి ఉద్ధరించుటకు కంకణము కట్టినవారు, చరిత్రలో మరువరానివారు రెడ్డిత్రయ మున్నారు. వారిలో నెక్కుడు కృషి సల్పిన మహనీయుడు శ్రీ సింగిరెడ్డి వెంకట్రామారెడ్డిగారు. వీరు కీ. శే. కాక పూర్వము అచిరకాలములోనే అనేక పదవులను చేపట్టి సమితి అధ్యక్షులుగా, మంత్రివర్యులుగా నుండి కీకారణ్యమైన ఈ క్షేత్రమునకు రోడ్డులు, రవాణా సౌకర్యములు, విద్యావ్యాప్తికై ఇచ్చట ఒక గురుకులపాఠశాలను స్థాపించిరి. మాజీ మంత్రివర్యులు, ముఖ్యమంత్రిగా నున్న గౌ. డాక్టరు మఱ్ఱి చెన్నారెడ్డిగారు వెంకట్రామారెడ్డిగారి సలహాలకు ప్రీతులై ఏతత్ క్షేత్ర పురోభివృద్ధి గాంచుటకు అతిథిగృహములను, R T C. బస్‌స్టాండును, ప్రభుత్వమువారి నుండి క్షేత్రాభివృద్ధికై లక్షలలో రూపాయలను మంజూరు చేయించి, కమిటీని నియమించి కృషి సలిపినారు. ఆ తరువాత మేడ్చల్ పంచాయతి సమితి అధ్యక్ష పదవిని అలంకరించిన T T.D. బోర్డు మాజీ సభ్యులు, మూడు చింతలపల్లి గ్రామనివాసి శ్రీ కామిడి వీరారెడ్డిగారు శ్రీ భవానీ రామలింగేశ్వరస్వామికి ప్రాంజలిడి, స్వామి కరుణాకటాక్షములతో ఈప్సితార్థంబుల పొంది ఈ క్షేత్రమును స్వస్థలంబుగా నెంచి, దేవాలయనిర్మాణకార్యక్రమమును, నీటి వసతిని, తిరుమల-తిరుపతి దేవస్థానమువారిచే వేద సంస్కృత పాఠశాలను శ్రీ రామలింగేశ్వర బోర్డు మెంబరుగా ఇచ్చటి విశేషోత్సవముల సౌకర్యములను విస్తృతిగావించుటయు మున్నగు ప్రజాహిత కార్యములను చురుకుగా సాగించి భక్తులలో నగ్రగణ్యుడుగా స్వామివారి అనుగ్రహపాత్రు డయ్యెను. ఈ విధముగా రెడ్డిత్రయము దైవ సంకల్పితులై ఈ క్షేత్రమును అభివృద్ధి గావించిరి

ఇవి యిట్లుండ మరొక వృత్తాంతము సన్నిహిత వర్గంబుల నన్వశ్రుతమై ప్రసిద్ధముగా నున్నది. హైదరాబాదును పరిపాలించిన నవాబు కాలమందు కీసర

గ్రామమును తురుక జాగీరులు పరిపాలించుచుండిరి. వారు చెప్పినదే వేదవాక్యము, వారు చేసినదే మంచిపని అన్నట్టు జరిగిన కాలమది కీసరగ్రామమును అప్పటి జాగీరుదారు పరిపాలించెను

అప్పటి పరిస్థితులలో ఈ క్షేత్రములోని దేవాలయాది భవనములు ఇంత అభివృద్ధి చెందియుండలేదు ఒక పర్యాయము హైదరాబాదులోని హైందవ కుటుంబములో మహోన్నత గౌరవభాజనమై కీర్తిగన్నవారు, సిరిసంపదలతో తులతూగిన బంగారు వ్యాపారి త్ర శ్రీ రాంగోపాల్ మామగారు నారాయణదాసు గారు కీసరిగిరిపై దైవసన్నిధిన మండలంరోజుల కాలము గడిపి ఈప్సితార్థములను పడయుటకొఱకు పూజకై కావలసిన వస్తువులను 11 దబ్బాల ఘృతమును తీసుకొని వచ్చి స్వామివారి సన్నిధానమున అఖండదీపములను వెలిగించి ధ్యానావస్థలోనుండగా కీసర జాగీరుకు ఈ విషయము తెలిసి తన అనుమతిలేనిదే వారు పూజలు ఎట్లు గావింతురని ఆలయాధికారులను దండించి వెంటనే తన మనిషి నంపి ఉన్నది యున్నట్లుగా తీసుకొని రమ్మని ఆజ్ఞ నిచ్చెను.

భక్తులు ఎంత వారించినా వినక వచ్చిన జాగీరు మనుష్యులు తీసుకవెళ్ళి తన ముందర నుంచగా రెండు గంటలలోనే జాగీరునకు కాళ్ళనుండి తలవఱకు మంటలేర్పడి అప్పటికప్పుడే హైదరాబాదు చికిత్సాలయమునకు గొంపోవగా అచ్చట నానాయాతన పడుచూ ''దైవసన్నిధిని తెచ్చిన అఖండదీపములను తిరిగి యథాస్థలమునందు పెట్టి మా కొఱకు పూజలు గావించమని చేసిన తప్పిదము వల్లనే నాకు ఈ ఆపద కలిగినదని'' చింతించుచూ రెండురోజుల తరువాత చనిపోతూ తన మరణవాగ్మూలమున చెప్పెనని నుడివి యుండిరి.

# క్షేత్రోత్సవములు

ఈ కీసరగిరిపై వేంచేసియున్న శ్రీరాముల వారిచే ప్రతిష్ఠింపబడియున్న భవానీశ్రీరామలింగేశ్వరునికి ప్రతిరోజు అభిషేకములు, అష్టోత్తరములతో బిల్వార్చనలు, అమ్మవారికి కుంకుమార్చనలు జరుపబడును. శ్రావణ, కార్తీక మాసాలలో ప్రత్యేక మాసోత్సవాలు జరుపబడును. ఆ సందర్భమున స్వామి వారికి మహాన్యాసపూర్వక అభిషేకములు, సహస్రనామార్చనలు, లక్షబిల్వార్చనలు, లక్షపుష్పార్చనలు, కుంకుమార్చనలు, భస్మాభిషేకములు, అన్నాభిషేకములు, సహస్రఘటాభిషేకములు, తదితర విశేషపూజలు జరుగును. ఆర్ద్రా నక్షత్రంతో కూడిన సోమవారాలలో విశేషపూజలు జరుపబడును. మరియు ఆశ్వయుజమాసమున దేవీనవరాత్రులు జరిపి భవానీదేవికి విశేష పూజ లొనరింతురు. గణేశనవరాత్రులందు, నిత్యపూజలు మహామంత్రానుష్ఠానము జరుగును. ప్రతిమాసమునందు కృష్ణచతుర్దశి మాసశివరాత్రులలో ప్రత్యేకపూజలు జరుపబడును. ఈ విధముగా నిత్యవేదపఠన శ్రవణకీర్తనాదులతో ఒప్పారుచూ నూతనముగా వివిధశిల్పకళారీతులతో గర్భాలయము, విమానము, ముఖమంటపము మున్నగు కట్టడములద్వారా నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవములతో నిత్యనూతనముగా విరాజిల్లుచున్నది.

## క్షేత్రవిశేషోత్సవములు

ప్రతి వత్సరము ఈ విశేషోత్సవములు మాఘ బహుళ త్రయోదశి మొదలు ఫాల్గున శుద్ధ విదియ అనగా (ఫిబ్రవరి - మార్చి) వరకు మహాశివరాత్రి సందర్భమున జరుగు బ్రహ్మోత్సవములు నేత్రపర్వముగా ఐదు రోజుల పాటు జరుగుతాయి. ఈ ఉత్సవములకు పది రోజుల పూర్వమే ఈ క్షేత్రము నిత్యాలంకారములతోను, విద్యుద్దీపాలతోను చక్కగా వసంతాలు చిలుకు వసంతోత్సవముగా పవిత్రస్థలముగా తీర్చిదిద్దుకొంటుంది. ఈ ఐదు రోజుల పర్వదినాలలో జనులు తండోపతండంబులుగా ఈ త్రిపురాంతకునికి కానుకలను భక్తితో సమర్పించుకొనుచు తమ తమ కోర్కెలను తీర్చుకొనుటలో కృతార్థు

లగుచుందురు. ఈ క్షేత్రమునకు వచ్చుటకు R.T.C. వారు ప్రత్యేక బస్సులను వివిధ ప్రదేశముల నుండి రాకపోకల సదుపాయమును కల్పించుదురు స్వామి వారికి ఉత్సవ దినములలో మొదటిరోజున స్వస్తివాచనములతో ఋత్విక్కులు హోమశాలలను చేరుటతో ఆరంభమై, రెండవరోజు అభిషేకము, పూజ, హారతులు, రుద్రస్వాహాకారహోమములు, అమ్మవారి మహోత్సవములు శ్రీ రామలింగేశ్వర స్వామి సేవతో సహా కీసరగ్రామమునుండి గుట్టపైకి రాత్రి 12 గం.లకు వేంచేయుట కళ్యాణోత్సవములు జరుగును. మూడవ రోజున సూర్యోదయాది మొదలు అర్ధరాత్రి లింగార్చన వరకు మహాశివరాత్రి అభిషేకములు, పూజలు, నందివాహన సేవయు జరుగును. నాలుగవరోజున అభిషేకము, హోమ, పూజా పారాయణాదులు, అనంతరము రథోత్సవము జరుపబడును.

ఐదవరోజున అనేక హోమములు, బలిప్రదానములు, జయాదులు, పూర్ణాహుతి, అవబృథము, ఋత్విక్పూజ, చక్రవారి శ్రీవారి సేవల నొంది సమాప్తి గావించబడును ఇట్టి సేవలలో అనేకమంది భక్తులు అనేకరీతులలో ఆలయమునకు పశ్చిమభాగమున నున్న తామరపువ్వులతో వికసించి నూతన శోభను సంతరించుకొన్న అందమైన తామరకొలని యందును, శ్రీ స్వామివారి పుష్కరిణియందును బ్రాహ్మముహూర్తము మొదలు సాయంకాలము వరకు స్నాన, జప, సంధ్యావందనాదులతో పాల్గొందురు. ఈ చెఱువునకు వలయాకారంలో మహాశివరాత్రి ఉత్సవాలకు రకరకాల దుకాణాలు పెడుతారు. గొప్ప సందడితోను కోలాహలంతోను ఈ కీసరగిరి ప్రతిధ్వనించుచుండును. దైవదర్శనం చేసుకొన్న యాత్రికులు ఇచ్చట విశేషంగా యున్న సీతాఫలము చెట్లు గుబురులమధ్యను, మోదుగ, మఱ్ఱిచెట్ల నీడలయందును సేదదీర్చుకొంటూ వారు తెచ్చుకొన్న ఫలహారములను సేవిస్తుంటారు. అనేకమైన చిరుతిండ్లతోను, శ్రీవారి ప్రసాదము, పులిహోర, లడ్డు, కొబ్బరిచిప్పలను, పండ్లను, ఫలహారములను. అనేకరకములైన భోజనాదులతోను, భక్తులు భుజిస్తూ కొందరు ఉపవాస, ములతో నుందురు. దూరంగా ఎగిరే రకరకాల పక్షులు చుట్టూరా వున్న వన సంపద, రాళ్ళగుట్టలు, కమ్మని గాలి, తీయని నీరు. మనల్ని ఊహాలోకంలోకి తీసుకొనిపోయి ఇటువంటి రమణీయప్రదేశంలో ఆ స్వామిని ప్రతిష్ఠించిన మహానుభావుస్ని మనస్సులో తృప్తిగా ఆరాధించుకొనేటట్లు చేస్తాయి.

ఇచ్చట దేవాలయమునకు తూర్పున ఆగ్నేయ మూలభాగమున సంన్యాసుల మఠము ప్రక్కగా, వేదసంస్కృత పాఠశాల ప్రాంగణం ప్రక్కభాగమునందు "కాళిబుగ్గ" లేక "పాలపుంత" అను జలాధార యున్నది. ఇది చాలా విశిష్టమై శిలామధ్యంబునుండి పుట్టి యున్నది. ఇందు దీర్ఘవ్యాధులు కలవారును, కోర్కెలు ఫలించనివారును, సంతానోత్పత్తి కోరువారు స్నానముచేసినను లేక మండలము రోజులు నిష్ఠతో యుండి ఈ జలమును సేవించినను వారి వారి కోర్కెలు నెఱవేరగలవని జనుల దృఢాభిప్రాయము. రైతులు ఇందలి జలములను తీసికొని వెళ్ళి సస్యసమృద్ధికొఱకు చల్లుచుందురు.

ముఖ్యంగా అన్ని రంగములవారు వారి వారి ఔన్నత్యములను ప్రదర్శించుటకు ఒక ప్రదర్శనశాలను ఇచ్చట మనోనేత్రంగా ప్రభుత్వమువారు ఏర్పాటు చేయుదురు. మరియు "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం" అన్నట్లు సంగీతము, సాహిత్యగోష్ఠులు, హరికథా కాలక్షేపములు, పురాణ శ్రవణాదులు, నాట్యములు, నాటకములు, వేదాంతోపన్యాసములు, వివిధ రకములైన భజనలు, క్రీడలయందు భక్తులు అభిరుచుల ననుసరించి ఆ యా రంగములందు పాల్గొనుచుందురు. ఈ విధముగా సంతానము లేనివారికి సంతానప్రాప్తి, విద్య లేనివారికి విద్యాప్రాప్తి, వ్యాపార లాభములు పొందుటకు వ్యాపారస్థులు, దైవ చింతన గల భక్తులు కోరిన కోరికలకు ఆలవాలమై కాశీ - రామేశ్వర మహాక్షేత్ర సమమైన కీసరగిరి శ్రీ రామలింగేశ్వరస్వామిని, భవానీదేవిని, మరియు శ్రీరామాజ్ఞచే గొని తేబడిన హనుమత్కాశీ ఏకోత్తర శత లింగములను సేవించి ధన్యు లగుచున్నారు.

# పరమ శివలింగ ధ్యానము

చైతన్యం పరిపూర్ణమేకమచలం జ్యోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షరమంత్ర మాద్యమఖిలం సూక్ష్మాతిసూక్ష్మం పరం,
లింగం బ్రహ్మ సనాతనం సుమనసాం ధ్యాతవ్యరూపం సదా
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే.

1. నీలకంఠం విరూపాక్షం తుష్టువుశ్చ సురాదయః,
నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవే నమః

2. నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః,
యాతే రుద్ర శివా తనూ రఘోరాయ నమో నమః.

3. నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ తే నమః,
సహస్రబాహవే తుభ్యం నమో మీఢుష్టమాయ తే.

4. కపర్దినే నమస్తుభ్యం కాలరూపాయ తే నమః,
నమస్తే చాత్తశస్త్రాయ నమస్తే శూలపాణయే.

5. హిరణ్యపాణయే తుభ్యం హిరణ్యపతయే నమః,
నమస్తే వృక్షరూపాయ హరికేశాయ తే నమః.

6. పశూనాం పతయే తుభ్యం పథీనాం పతయే నమః,
పుష్టానాం పతయే తుభ్యం క్షేత్రాణాం పతయే నమః

7. ఆతతాయిస్వరూపాయ వనానాం పతయే నమః.
రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః.

8. నమస్తే మంత్రిణే సాక్షా త్కక్షాణాం పతయే నమః,
ఓషధీనాం చ పతయే నమస్సాక్షాత్పరాత్మనే.

9. ఉచ్చైర్ఘోషాయ దేవాయ పత్తీనాం పతయే నమః,
సత్త్వానాం పతయే తుభ్యం వనానాం పతయే నమః.

10. సహమానాయ శాంతాయ శంకరాయ నమో నమః,
ఆధీనాం పతయే తుభ్యం వ్యాధీనాం పతయే నమః.

11 కకుభాయ నమస్తుభ్యం నమస్తేఽస్తు నిషంగిణే,
సేనానాం పతయే తుభ్యం కృత్రిమాయ నమో నమః.

12. తస్కరాణాం నమస్తుభ్యం పతయే పాపహారిణే,
వంచతే పరివంచతే స్నాయూనాం పతయే నమః.

13 నమో నిచేరవే తుభ్యః మరణ్యపతయే నమః,
ఉష్ణీషినే నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే.

14. విస్తృతాయ నమస్తుభ్యమాసీనాయ నమో నమః,
శయానాయ నమస్తుభ్యం సుషుప్తాయ నమో నమః.

15. ప్రబుద్ధాయ నమస్తుభ్యం స్థితాయ పరమాత్మనే,
సభారూపాయ తే నిత్యం సభాయాః పతయే నమః.
నమశ్శివాయ సాంబాయ బ్రహ్మణే సర్వసాక్షిణే.

# శివ స్తవము

కం. శ్రీ కేసరిగిరివాసా!
రాకేందుధరా! హరా! వరాత్పర! శర్వా!
శ్రీకంఠ! భవవిలుంఠన!
శ్రీకరమగు నీదు సేవ శ్రితజనరక్షా! 1

కం. రక్తిగ నటరాజేశ్వర!
భక్తాళిని బ్రోచుకొరకు భద్రంబగు నీ
ముక్తిద కేసరిగిరిపై
శక్తుడవై వెలసినట్టి సర్వేశ! శివా! 2

కం. శ్రీరామలింగనాథ! ధ
రర్నాజితమైన కేసరిగిరీంద్రమునన్
శ్రీరమ్యమై జనాళిక
వార్య వరప్రదుడగుచు వరలు దయాళూ! 3

కం. మౌనిహృత్పద్మభృంగ! భ
వానీపతి! వాసవాదివందితచరణా!
నీ నామస్మరణంబున
నానావిధకలుషజాలనాశన మభవా! 4

---

కొన్ని కఠినపదములకు అర్థములు :

1) భవవిలుంఠ = పుట్టుకను త్రెంచివేయువాడా (2) ముక్తిద = మోక్షము నిచ్చువాడా! (3) రాజితము = వెలుగొందునది (4) హృత్పద్మభృంగ = హృదయము అను పద్మమునకు తుమ్మెదవంటి వాడా!

కం శంకర! భక్తవశంకర!
సంకటహర! సర్వలోకసంసేవ్య! శివా!
శంకలు లేక భజింతు భ
భంకర! భవ! పాపనాశ! భర్గ! మహేశా! 5

కం. ప్రమదగణనాథ! నిన్నతి
ప్రమదంబున పూజసేయు ప్రవిమలమతికిన్
క్రమమున సంక్రమమగు నీ
ప్రమదోన్నత భక్తియుక్త పద్ధతి యభవా! 6

కం. హాలహలభక్షణచణ!
కోలాహల లయకర ప్రకటన శివా!
శూలాయుధ ధారణకర!
ఫాలాంబక! నన్ను కరుణఁ బాలింపు భవా! 7

కం. వందనములు గైకొను మిదె
వందారుమునీంద్రవందిత! వరదా!
బృందారక బృందంబుల
వందనముల నందుకొనుచు వరలు మహేశా! 8

కం భువనావన! పరిదేవన
మవనత శిరమున నొనర్తు మనువుము దేవా!
భవ! నా భవబంధములను
భవదీయ దయావిభూతిఁ బారద్రోలు శివా! 9

కం రక్తిగ నిను నే వేడెద
శక్తుండవు సర్వలోకసంరక్షణు డా
భక్తజనావనదక్షా!
ముక్తిపదం బనుమతింపు మురగవిభూషా! 10

కం శంభో! సాంబ! దిగంబర!
అంబరకేశా! మహేశ! ఆశ్రితరక్షా!
శుంభత్ శూలాయుధధర
అంబాహృదయాంతరంగ! హర! త్రిపురహరా! 11

కం. దక్ష విపక్షణ శిక్షణ
దక్షా! యక్షీణ వీక్ష దహనక్షణ ఫా
లాక్ష! దయ నీక్షింపుము
అక్షయమగు క్షేమ మొసఁగి ఆశ్రితరక్షా! 12

కం. ధరణీధర కన్యకాపతి!
ధరణీధరచాప! హర! ధరాధరనిలయా!
ధరణీరథీకృతా! తవ
ధరణీయుడు బాణమగుచు ధన్యత హరియున్. 13

కం. ధవళాచల నిలయా! శివ!
ధవళాంగా! ధవళభూతీధర! సర్వేశా!
భవదీయు భక్తకోటికి
భవబంధ విమోచనమునఁ బరగు మహేశా! 14

కం. చలువమల నిలయ! విలయకృ
శలనలరెడునతికనయన! హర! కరుణమునన్
నలువున నరయమునను నిత
రుల భజనము సలుపజనను రజతగిరిపతీ! 15

**అర్థములు :** 7 భక్షణచణ = భక్షించుటకు చాలినవాడా! కోలాహల లయకర ప్రకటనటనశివా = కలకలముగా లయమును పొందినప్పటి నాట్యమును ప్రకటించు శివా! 8. వందారు = పాదము లంటి మ్రొక్కునట్టి. బృందారక బృందముల = దేవతా సమూహముల, విభూతి = సంపద, పరిదేవనము = ప్రార్థనము 11. శుంభత్ = ప్రకాశించునట్టి, 12. దక్ష విపక్షణశిక్షణదక్షా = దక్షుడను నీ విరోధిని శిక్షింపగల్గిన సామర్థ్యము కలవాడా! వీక్ష = చూపు 13. ధరణీరథీకృతా = భూమిని రథముగా చేసుకొన్నవాడా! తవ ధరణీయుడు = నీకు ధరింపదగినట్టివాడు, ధరణీ ధరచాప = (మేరు) పర్వతమును చాపముగా చేసికొన్నవాడు. ధరాధర నిలయా = హిమాలయ పర్వతమందు నెలకొన్నవాడా!

కం. సంసారార్ణవ తరణము
సంసరణ పురాకృతాఘసంహరణంబున్
సంసక్తాయతమతి నిను
సంస్మరణము సేయునట్టి సంయమికి శివా! 16

కం. పంచాక్షరీమహామం
త్రోచ్చారణమాత్రముననె తృటిలో కటువౌ
సంచితపాపము లణగు స
మంచితమగు పుణ్యమబ్బు మనుజులకు శివా! 17

కం. వందనము నీకు శివ! మఱి
వందన మిదె నీదు సతి భవానికి భక్తిన్
వందనము నీకు నియతిన్
వందనములు చేయు భక్తవర్యులకు భవా! 18

కం. పశుపతి! నీకు నవశ్యము
వశు(డై తిని నన్ను బ్రోవవయ్య మహేశా!
నశియింప నాదు కలుషమ
నిశమును కృపజూడుమయ్య నిటలాక్ష! శివా! 19

కం. సర్వేశ్వరా! హరా! నిను
నిర్మలభక్తి న్మనంబు నితరేతరమౌ
దుర్గతుల జెందనీయక
యర్చించెద రక్షసేయవయ్య రయమునన్. 20

---

**అర్థములు :** 15. విలయకృశలన్ = ప్రళయకాలాగ్ని కీలలన్, అలికనయన = నొసటియందు కన్ను కలవాడా!, 16 తరణము = తరింప జేయునది, పురాకృతాఘ = పూర్వజన్మ మందలి పాపములను, సంసరణ = సంసారపు సంసక్తాయతమతిన్ = మిక్కిలి ఆసక్తిగల విశాలమైన మనస్సుతో, 17. కటువౌ = కఠినమైన, సంచిత = సంపాదింపబడిన, సమంచిత = చక్కగా ఒప్పునట్టి; 18. నియతిన్ = నియమముతో, 19. కలుషము = పాపము, అనిశము = ఎల్లప్పుడు, 20. ఇతరేతరమౌ = వేఱువేఱగు (ఇతరములైన).

# క్షేత్ర దర్శనీయ ప్రదేశములు

1. శ్రీ రామలింగేశ్వరస్వామి ప్రధాన దేవాలయము.
2. భవానీ, విఘ్నేశ్వర విగ్రహములు.
3. స్వామి పుష్కరిణి.
4. మత్స్య, కూర్మ, వరాహ, అంజనేయ, విఘ్నేశ్వరులతో చెక్కియున్న విజయ స్తంభము.
5. అక్కన్న, మాదన్నల లక్ష్మీనృసింహస్వామి వారి దేవాలయము.
6. ఆళ్వారుల విగ్రహములు.
7. ఆంజనేయస్వామివారి దేవాలయము.
8. సీతమ్మ వారి దేవతాస్థానము.
9. శైవ విఘ్నేశ్వరాలయము.
10. సీతాసరోవరము.
11. క్షేత్రపాలక, భైరవ విగ్రహములు.
12. సన్యాసిమఠము.
13. 101 శివలింగములు.
14. పాలపుంత లేక కాశీబుగ్గ పరిసరమున నున్న ప్రత్యేక గుహ.
15. దక్షిణ నైరుతి దిశగా శ్రీరాములవారి పాదములు.
16. పుట్టవద్దనున్న నందిసేవిత శివలింగము.
17. బ్రహ్మోత్సవ రథము.
18. తామరకొలను.
19. శ్రీ సీతారామలక్ష్మణుల శిల్పము.
20. ప్రక్కనున్న నంది స్తంభములు.
21. దేవఖాతములు.
22. ఆంజనేయ విగ్రహములు.
23. ప్రాచీన జైన విగ్రహము.

24. పురావస్తుశాఖా ప్రత్యేకములు.
    i. శివాలయము.
    ii. యజ్ఞవాటిక.
25. వేద సంస్కృత పాఠశాల భవన సముదాయములు.
26. ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల భవన సముదాయములు.
27. జిల్లా పరిషత్ అతిథి భవనములు.
28. R. & B. అతిథి భవనము.
29. ఆంజనేయునిచే విసరివేయబడిన శివలింగములకు ఆలయములు కట్టించి అర్చనలు చేయుచున్నారు.
    i. ఈ క్షేత్రమునకు ఉత్తరభాగమున 3 కి.మీ. దూరమున ఎత్తయిన కొండ శిఖరముపై శంకరాయని ఆలయము కలదు. దీనిని శంకరాయని గుట్ట అందురు. కార్తీక పౌర్ణమినాడు ఇచ్చట ఉత్సవములు జరుగును. ఈ కొండ గుహలలో సాధువులు, సన్యాసులు నిత్యస్నానులై, నిస్సంగులై, సాధనలను చేసుకొనుచు కన్పట్టుచుందురు.
    ii. రామలింగముపల్లి శివాలయము.
    iii. పర్వతాపుర గ్రామ శివాలయము.

పై రెండు గ్రామములలో ఆ యా గ్రామప్రజలు ఆలయములను కట్టించి నిత్య పూజలు చేయుచున్నారు.

# విద్యా సౌకర్యాలు

## వేదసంస్కృత పాఠశాల

ఈ పాఠశాల తిరుమల తిరుపతి దేవస్థానములచే నిర్వహింపబడు శ్రీ వెంకటేశ్వర వేదాన్తవర్ధినీ సంస్కృత కళాశాల, హైదరాబాదువారి అనుబంధితముగా నడుపబడుచున్నది. ఇచ్చట గురుకుల పద్ధతిలో కృష్ణయజుర్వేదము, సంస్కృత శాస్త్రములు బోధింపబడుచున్నవి. ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి సంస్కృత విభాగమునకు సంబంధించిన సాహిత్య, వ్యాకరణ, న్యాయ, పరీక్షల ననుసరించి కళాశాలవారు ఎంట్రన్సు P.D.C. (Pre-degree Course), B A (Languages) మరియు కృష్ణయజుర్వేదము 12 సం॥లు బోధించుచున్నారు ముఖ్యముగా రంగారెడ్డి జిల్లాలో వేదసంస్కృత పాఠశాలను స్థాపించుటకు అహర్నిశలు పాటుపడి ఈ క్షేత్రముపై కళాశాల ప్రిన్సిపాల్‌గారైన శ్రీ గొడవర్తి శ్రీరామమూర్తిగారి ప్రోత్సాహముతో T.T D. నిర్వాహక మండలి సభ్యులు శ్రీ కె. వీరారెడ్డిగారి ప్రోద్బలముతోను, 1981 వ సం॥ము ఆగస్టు నెల 7 వ తేదీన శ్రీ టి. నాగరత్నం I.A.S. గారిచే ప్రారంభోత్సవము చేయబడినది. అప్పటినుండి ఈ పాఠశాలలోని విద్యార్థులు వేద, సంస్కృత అధ్యయనముచే అపరబ్రహ్మలవలే అనవరతముగా వల్లించుట వినిపించుచుండును. తిరుమల-తిరుపతి దేవస్థానములవారు ప్రాచ్యసంస్కృతిని పరిరక్షించుటకై వీరికి కావలసిన వసతి భవనములు ఎంతయో డబ్బును చివ్చెంచి నిర్మించుచున్నారు.

## ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయము

గ్రామీణ ప్రాంతాలలో నివసించుచూ ప్రతిభావంతులై యుండి ఆర్థికముగా వెనుకబడిన విద్యార్థులకు అన్నిహంగులు కలిగి పాఠశాలలో చదువుకొనెడి అవకాశమును కలిగించు ఉద్దేశముతో ప్రభుత్వం 1972 వ సం॥ము G.O No. 352 తేదీ 1.3.72 ద్వారా 'ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాలల సంస్థ'

అను పేరుతో ఒక స్వయంపరిపాలనాధికారము గల సంస్థను ఏర్పాటు చేసిరి. ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి ఈ సంస్థకు అధ్యక్షులు, శ్రీ గౌ॥ డా. చన్నారెడ్డి గారు ఈ క్షేత్రముపై అందరి సమక్షమున 1980 సెప్టెంబరు 4 న గురుకుల పాఠశాలకు శంకుస్థాపన గావించి ప్రారంభించిరి రంగారెడ్డిజిల్లాలో ఒక గురుకుల పాఠశాలను స్థాపించుటకు ఎన్నియో రోజులు నుండి కలలుగన్న శ్రీమాన్ వెంకట్రామారెడ్డిగారు ఈ క్షేత్రమున శంకుస్థాపన చేయించుటలో కృతకృత్యులైరి ఈ పాఠశాలయందు పేద, ధనికయను వర్గములు లేవు. క్రమశిక్షణకు ఆలవాలమైనది. ఇచ్చట విద్య నభ్యసించు విద్యార్థు లందరు చెట్టాపట్టాలేసుకొని యుందురు. ప్రవేశము పొందిన వారికి హాస్టలులో ఉచిత వసతి మరియు భోజన సౌకర్యములు కల్పింపబడుచున్నవి. విద్యార్థులు ఎంతయో శ్రమించి ప్రతి వత్సరము ప్రథమశ్రేణియందు ఉత్తీర్ణులు అగుచున్నారు.

## ఉత్తరోత్తరాభివృద్ధి కార్యక్రమములు

ఈ క్షేత్రముపై దర్శింపవచ్చు యాత్రికులకు గాను సత్రములు, నీటి పారిశుద్ధ్య వసతులను దేవస్థానమువారు కల్పించుటకు తగు నిర్ణయము తీసుకొని యున్నారు. ప్రభుత్వమువారిచే ప్రయాణసౌకర్యములు, ఉచితవసతి, ఆసుపత్రులు, తంతితపాలాసౌకర్యములను కల్పించుటకు ప్రయత్నించవలయును.

## పరిశీలనలో నున్న విషయములు

భక్తుల సౌకర్యార్థమై ఆలయట్రస్టు బోర్డువారు శాశ్వత ప్రాతిపదికపై జరుపుటకు ఈ దిగువ తెల్పిన కార్యక్రమములు పరిశీలనలో నున్నవి—

(1) శాశ్వత కళ్యాణోత్సవములు
(2) నిత్యారాధన కళ్యాణోత్సవములు
(3) నిరతాన్నదానము
(4) శాశ్వత చందాదారులు
(5) పోషక చందాదారులు
(6) నిత్యప్రసాద పథకము

## ఈ క్షేత్రమునకు మార్గసౌకర్యములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు బస్సుసౌకర్యమును కలిగించియున్నారు. సికింద్రాబాద్ ఉప్పల్ బస్టాండు నుండి కీసరగుట్టకు నేరులో వచ్చు బస్సున్నూ, బోగారం లేక ఉద్దిమట్టి బస్సులు కీసర గ్రామమువరకున్ను కల్పించియున్నారు. కీసరగ్రామమునుండి అడ్డదారియందు 1 కి మీ దూరము నడచిన లేక బస్సు మార్గమున 5 కి.మీ, వచ్చిన కీసరగిరికి చేరవచ్చును. ఖాజీపేట రైలు మార్గమున ఘట్ కేసర్ స్టేషను నుండి ఆరుమైళ్ళ దూరమున రోడ్డు మార్గమునకు మోటారువాహనాదులతో చేరవచ్చును. ఉప్పల్ బస్టాండు నుండి తారనాక మీదుగా కుషాయిగూడ, బండ్లగూడ, కీసరగ్రామము మీదుగా రహదారిపై వాహనములు నడుపుటకు అనువుగా క్షేత్రపైభాగమువఱకు తారు (డాంబరు) రోడ్డును వేయించియున్నారు.

## శ్రీ కేసరిగిరి రామలింగేశ్వరస్వామి బ్రహ్మోత్సవము

ఇది ఒక చారిత్రక స్థలం. ఆధ్యాత్మికతత్వాన్ని రంగరించుకున్న మన పుణ్యభూమిలో ఆనందం పరమార్థంతో కూడిన ఆత్మానందం సచ్చిదానందంగా రూపొందింది. ఆత్మను దర్శించడానికి అనువుగా తపోవనాలుగా దేవాలయాలుగా తీర్చిదిద్దుకున్నాడు మానవుడు.

ఒకానొకప్పుడు మన హిందూధర్మసంస్కృతికి ఆలవాలమై కొండచరియల మధ్య తేజోమయమై హిందూమతానికి నాటికి నేటికి దర్పణంగా నిలిచియున్న పాతకట్టడాలతో ఒక దేవాలయము కన్పట్టుచున్నది. ఇది కేవలము చారిత్రక స్థలమే కాక ఒక పుణ్యక్షేత్రమై భాసించుచున్నది ఈ క్షేత్రమునందు ప్రధాన దేవాలయం శ్రీ రామలింగేశ్వరాలయం. అమ్మవారు శ్రీ భవానీదేవి. ఈ ఆలయం పశ్చిమాభిముఖముగా నున్నది. ఈ క్షేత్రము "కేసరిగిరి" యను నామముతో రంగారెడ్డి జిల్లా మేడిచల్ తాలూకాలో భాసించుచున్నది. హైదరాబాదు నగరమునకు 20 మైళ్ళ దూరములో నున్నది.

ఇచ్చటి ఈశ్వరలింగం శ్రీరామచంద్రునిచే ప్రతిష్ఠింపబడుటచే శ్రీరామలింగేశ్వరస్వామిగా వ్యవహరింపబడుతూ యున్నది. త్రేతాయుగంబున శ్రీరాముడు అయోధ్యా పట్టణమున పట్టాభిషిక్తుడై నిష్కంటకముగా రాజ్యపరిపాలన చేయు

చుండ ఒకనాడు జనపదనివాసి యగు వృద్ధబ్రాహ్మణుడు మృతబాలకుని గొని రామరాజ్య సభాస్థలంబున కేతెంచి ఈ అకాలమరణమునకు రాజు కారకుడు కావున ఈ బ్రహ్మహత్యాపాపము నీకుం జెందును. అని ఇట్లు వాపోవుచుండ అంతనారదమునిచే ప్రేరితుడై వసిష్ఠుడు- 'ఇయ్యది త్రేతాయుగము నీచులకు తపస్సు చేయఅర్హత లేదు.

"శమ్బూకో నామ వృషలః పృథివ్యాం తప్యతే తపః,
శీర్షచ్ఛేద్య స్స తే రామ తం హత్వా జీవయ ద్విజమ్.

అనిన శ్రీరాముడు, స్వశరీరస్వర్గార్థియైన శంబూకుని ఉత్తమశిరమును, అంగములను కత్తిరించె. తపస్విని చంపుటచే పశ్చాత్తాపములో అగస్త్యమహర్షిచే పాపపరిహారమార్గమును ఉపదేష్టుడై ఈశ్వరుని ఆరాధించి సుముహూర్తమునకు శివలింగ ప్రతిష్ఠాపన చేయుటకు నిశ్చయించి ముహూర్తసమయమునకు వారణాసి నుండి తత్ప్రమాణలింగమును తీసుకొని రావలసినదిగా హనుమంతునకు ఆజ్ఞనిచ్చెను. ముహూర్తసమయం దాటిపోవుచున్నదే కాని హనుమంతు డింకనూ రాలేదని శ్రీరాముడు సకాలంలో స్వామిని ప్రతిష్ఠించాలనే సంకల్పంతో స్వయం భూలింగమును ప్రతిష్ఠించెను. తరువాత హనుమంతుడు 101 లింగములను తీసుకొని వచ్చి లింగప్రతిష్ఠ అప్పటికే జరిగిపోయిందనే కోపంతో వాటిని చెల్లాచెదురుగా విసరి వేశాడట. హనుమ కోపమును చల్లార్చుటకై వానిని సమీపించి ఈ క్షేత్రం కేసరి క్షేత్రంగా ప్రఖ్యాతి వహిస్తుందని రాముడు ఓదార్చాడట. అప్పటినుండి ''కేసరిగిరి' శ్రీ రామలింగేశ్వరస్వామిగా ప్రఖ్యాతి వహించు చున్నది. పానకట్టములు లేకనల్లరాతితో మలచబడ్డ ఈ శివలింగాలు శిథిలావస్థలో ఇప్పటికి కన్పట్టుచున్నవి.

మహా శివరాత్రి సందర్భమున విశేషముగా బ్రహ్మోత్సవములు జరుగును ప్రతి సంవత్సరము మాఘ బహుళ త్రయోదశి నుండి ఫాల్గున శుద్ధ విదియ (ఫిబ్రవరి, మార్చి) వరకు 6 రోజులు అశేష జనసందోహములమధ్య జరుగుచుండును. ఈ ఉత్సవములకు వలయు అన్ని హంగులు దేవస్థానమువారు కల్పించుదురు. R. T. C. వారు అన్నిరూట్లనుండి బస్సుసౌకర్యములు కల్పించుదురు. లక్షలాదిమంది శివరాత్రి రోజున శివుని కృపాకటాక్షమునకు లోనగుదురు. ఈ సంవత్సరము మార్చి - 6 నుండి 11 వరకు జరుగును. కావున యావన్మంది భక్తులు కాశీసమమైన శ్రీ కీసరగిరి రామలింగేశ్వరస్వామిని దర్శించి తరించండి.

